# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



మే 1969



సంపుటము : 46 : సంచిక : 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1969

# సూర్యుడెన్నిమార్లు లేస్తేనేం!

శ్రీ పరిగి రాధాకృష్ణ

ఎన్నడూ లేనిది
ఎంతో ముందుగా లేచి
సూర్యునికోసం ఎదురు చూశా నీ రోజు.
సూర్యోదయంతో నా చిక్కులన్నీ
మంచులా విడిపోతాయనికాదు
సూర్యుని గురించి నిజమేదో
స్ఫురించిం దీ రోజు నాకు
ఎంత జీవశక్తికి కారకుడతడు
రోజు రోజుకీ అతడెంత నవ్యుడు !
మరి సూర్యునికి గతం లేదా?
ఒకవేళవుంటే అది
అతనికి భావికి అడ్డొస్తుందా ?
అతని ప్రకాశాన్ని తగ్గిస్తుందా?
భావి గతానికి శత్రువా ?
ఏమైనా ఒకటి నిజం
సూర్యునికన్నా సత్యం లేదు
అతనికన్నా నవ్యుడు లేడు
నాలో సత్యానికీ రోజు స్థానం లేదు
అందుకే సూర్యుడు నాలోకి రాడు
నాలో ప్రకాశించడు
నా అజ్ఞానాన్ని కాల్చడు
నాలో పేరుకున్న చీకటిని చీల్చడు
ఎన్ని అమావాశ్యలు నాలో
కరుడుగట్టుక పోయాయి!
ఎన్ని ఆశల జలపాతాలు

దూకి తమ శక్తిని కోల్పోయాయి!
ఎన్ని వాన చినుకులీ ఇసుక నేలలో
ఇంకిపోయాయి !
ఇంగితంలేని నాలాంటి మనిషి బ్రతుకులో
ఇంద్రధనుస్సు లెన్ని విరిసి మాయమైనాయి
నాలో ఏదీ ఎందుకు నిలవదు ?
నన్ను నేనెందుకు గెలవలేకున్నాను ?

## 2

ఎప్పటికప్పుడు కొత్తగా ప్రయాణ సన్నాహం
తప్పటడుగువేసి నాలుక్కరచుకునే దైనం
నేను సూర్యునిమాసి ఏమైనా నేర్చుకున్నానా?
నేను నిజంగా కాంతిని కోరుతున్నానా?
చిత్తశుద్ధితో చైతన్యమే వాంఛిస్తున్నానా?
చైతన్యం పేరుతో అరాజకాన్ని సృష్టిస్తున్నానా?
ఎక్కడ బడితే అక్కడ ప్రశ్నలు!
ఎక్కడికక్కడ ఏదో అసంతృప్తి
ఆగ్రహం ఆఘాయిత్యం అలజడి
ఫలితం అనుచితం!
పరిణామం అమానుషం!
అహంతో మనిషి మొహం మెరుస్తుంది
నకిలీ సరుకు తళతళమంటుంది
అసలు విలువ వెలవెలబోతుంది.

## 3

ఎందుకు బ్రతుకుతున్నానో మరచి
ఏమిటి మాట్లాడుతున్నానో మరచి
నా మూర్ఖత్వాన్ని నాలుగు పక్కలా పరచి
ఏదో దొరికిందని మూటగట్టి
ఇంటికివెళ్ళి చూసుకుంటే ఏముంది ?
మూట ఖాళీగానే వుంది
నా మూర్ఖత్వం నా దగ్గరే వుంది

## సూర్యుడెన్ని మారులొస్తేనేం?

స్వార్థం ఒక మూలల్లో దాక్కుని
నిన్ను వీడని చిరనేస్తాన్ని నేను
అని పగలబడి నవ్వింది.
స్వర్గం నాకు కొన్ని కోట్ల మైళ్ళ
దూరం జరిగి నట్టనిపించింది
ఎందుకు బ్రతుకులో ఈ ఖాళీ
శూన్యాకాశం లాగ
నెల చివరి రోజుల్లో
ఉద్యోగి పర్సులాగ
ధనికుని దయాగుణం లాగ
వ్యాపారి నిజాయితీలాగ
పతిత ప్రేమలాగ
ఎందుకీ ఖాళీ?
దీన్ని దేంతో నింపాలి ?
దేనికైనా విలువంటూ వుందా
అసలు విలువకే విలువుందా
పోనీ అనుకుంటే
గుండె నిండా ఈ గుబులెందుకు ?
విదిలించుకోలేని ఈ వెలితి ఎందుకు?
నా యింటిని చూసి నాకే అసహ్యం
నా కంటిని నేనే పొడుచుకునే ప్రయత్నం
నా జీవితం అలక్ష్యానికి బలైపోతూందా
నా ప్రతిబింబం నానాటికీ వెలవెలబోతూందా
ఏం చెయ్యాలో చెప్పేదెవరు ?
అందరూ ప్రశ్నలే వేస్తున్నారు !
కఠిన పరీక్షా పత్రమయింది జీవితం
ఎంతలో ఎంత దారుణంగా మారిపోయింది
గాజుగ్లాస్‌లాంటి జీవితంపై ఈ రాళ్ళవర్షమేమిటి ?
గంభీరమైన చూపులో ఈ వక్రత ఎలా జొరబడింది ?
గానుగెద్దు వలయం నన్నెందుకు కట్టిపడేసింది ?

## 4

వస్తాడనుకున్న సూర్యుడు
రానూ వచ్చాడు వెళ్ళనూ వెళ్ళాడు
అతడు నిస్వార్థుడే
అతడు కురిపించిన కాంతిలో
కనీసం ఒక్కకిరణమైనా
నాలోకి ప్రవేశించలేదే
నాలో చీకటిని తరిమివేయలేదే
అంత శక్తివంతుడైన సూర్యుడు సైతం
మనిషి విషయంలో నిస్సహాయుడా!
అవునేమో
మనిషి చీకటిని ప్రేమిస్తున్నంత కాలం
కల్లోలాన్ని చైతన్యంగా భ్రమిస్తున్నంత కాలం
సూర్యుడు నిస్సహాయుడేనేమో!
మనిషిలో సత్యం నిలవదేమో
మరి ఎన్నిమార్లు సూర్యుడు
వచ్చివెళితే మాత్రమేమి?
మనిషి నిజంగా కాంతిని కోరనపుడు
నిష్కల్మషమైన ఆలోచనా పరిధిలోకి చేరనపుడు
సూర్యుడెన్నిమార్లు లొస్తేనేం?

---



# కొండవీటి రెడ్డిరాజుల బిరుదావళి - వివరణ

శ్రీ సి. బి. వి. అప్పారావు

క్రీ. శ. 1323 లో ఓరుగల్లురాజ్య పతనానంతరము యవనులు ప్రారంభించిన అత్యాచారముల నరికట్టి హిందూ సంస్కృతి రూపుమాయకుండ దానిని కాపాడిన రాజవంశములలో రెడ్డిరాజుల వంశము ప్రధానమైనది. రెడ్డిరాజులు పరమధార్మికులై ఎనలేని బ్రాహ్మణభక్తిగలిగి ఆధ్యాత్మిక విజ్ఞానులైన విప్రుల కనేకాగ్రహారములు దానముజేసి, నాశనము జేయబడిన దేవాలయములకు పునఃప్రతిష్ఠలు గావించి, హేమాద్రి చతుర్వర్గ చింతామణిలో జెప్పబడిన సమస్తదానములనుజేసి ఆ విధముగా హిందూసంస్కృతిని పునరుద్ధరించి కీర్తి నార్జించుకొనిరి రాజ్యతంత్రజ్ఞులై ప్రజారంజకముగ మధ్యాంధ్రదేశమును పాలించిరి. రెడ్డిరాజ్య స్థాపకుడు ప్రోలయవేమారెడ్డి. వీరికి మొదట అద్దంకి, తర్వాత కొండవీడు రాజధానులు. ఆంధ్రుల చరిత్ర నిర్మాణమునకు శాసనములు, కైఫియతులు, వాఙ్మయము ఎట్లు తోడ్పడునో అట్లే ఆయారాజులు వహించిన బిరుదులుగూడ తోడ్పడును. ఆ బిరుదులు ఆ రాజుల రాజకీయ, ఆధ్యాత్మిక, సాంఘిక, ఆర్థిక జీవితఘట్టములలోని ముఖ్యసంఘటనలను నిర్ధారించుట కుపయోగపడును.

పూర్వకాలపు రాజవంశములలో మొదటి రాజులు వహించిన బిరుదులను పరంపరగా ఆ వంశములోని చివరివారు గూడ దాల్చుటొక పరిపాటి. యుద్ధములందును, వాదములందును ఓడిపోయినవారు తమ బిరుదులను విజేతల కప్పగించి తాము వానిని వదలుకొనుటొక ప్రాచీనాచారము.

కొండవీటి రెడ్డిరాజులలో మూడవ ప్రభువగు అనవేమారెడ్డి మహావీరుడు. మహాధార్మికుడు ఇతడు క్రీ. శ 1364–1386 వరకు రాజ్యముజేసి ఆ కాలములో అనేకయుద్ధములుజేసి రెడ్డిరాజ్యమునకు సుస్థిరత చేకూర్చెను. శ స. 1299 (క్రీ. శ 1377) లో అనవేమారెడ్డి తన తండ్రియగు అన్నయరెడ్డి పుణ్యమునకై శ్రీశైలములో వీరమంటపము నొకదానిని కట్టించి ఒక శాసనము వేయించెను ఆ శాసనములో తన వంశములోని పూర్వులు సంపాదించి వహించిన బిరుదులు, తాను దాల్చిన బిరుదులు–అన్నియు నొకచో గూర్చి చూపెను. ఆ శాసనము S. I. I. Vol. X. లో 559/A R. No. 20/1915 నంబరుగా ప్రచురించబడెను. ఆ బిరుదుల వివరణ తెల్పు ప్రయత్నమే యీ వ్యాసోద్దేశ్యము.

ఈ శాసనమును రెండు భాగములుగా విభజింపవచ్చును. మొదటిభాగము సంస్కృత శ్లోకములలో ఆ రాజుల వంశక్రమము; రెండవ భాగములో వారి బిరుదావళి గలవు బిరుదావళి చెక్కబడిన రెండవ భాగము నిందు పొందుపరచెదను

No. 559. S. 1299 (పింగళ) A. D. 1377.–

"States that King Anavema Reddi, constructed a Viramandapam in the temple of Mallikarjuna on the Srisaila Hill. The sanskrit portion of this long inscription is composed by Balabharathi, the Vidwan attached to the court of Anavema; and Mallayya, son of Pancha-bhiksha Ramanatha was the promptor (Karayita) of this Dharma. The inscription gives the full geneology of the Reddis upto Anavema and also a complete list of their Birudus. It is stated

in this inscription that the Reddis belong to Vellacheri gotra.

*　　　*　　　*

## రెండవ వైపు

[ఓం] స్వస్తి శ్రీ జయాభ్యుదయ శక వరుషంబులు 129 (9) అగు నేంటి పింగళ సంవత్సర మాఘ శు (5) బుధవారమునను॥ ఆధ శ్రీమదంనవేమ భూపాలకస్య బిరుదావళి (:)

స్వస్తి సమస్త గుణగణాలంకార
చంచుమలయ మూరకార
విశ్వవిశ్వంభరా భరణదక్షదక్షిణ భుజాదండ
జగనొబ్బగండ
అనయమండలీకర గండ
రాయ చకోలు గండ
అర్ధి (ప్ర) త్యర్ధి హేమాద్రి దాన నిరత
ప్రజా పరిపాలనా (చతుర)
హరణ భరణ రూపనారాయణ
వీరనారాయణ
భుజబలభీమ
అపరిమిత భూదాన పరశురామ
అనేక నగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహువిధారామ
సంగడి రక్షపాల
జగరక్షపాల
జగదగోపాళ
గుజ్జరితటోట్టివిభాళ
రాచూరి దుర్గ్గ విభాళ
అనవరతదత్తానేకాగ్రహారభూదేవకారితసోమపాన
శ్రీ పర్వ్వతా హోబల నిర్మిత సోపాన
పంచారామ ప్రతిష్ఠిత గజఘంటా నినాద
వర్ద్ధిత కీర్త్తి ఘంటానాద
కరవాళ వైనతేయ ఖండిత విమతవ్యాళ
దివి జల దుర్గ్గ విభాళ
కుడివదీ సహ్యజా గౌతమీ జలక్రీడా వినోద
శ్రీశైలత్రిపురాంతకాహోబలకాశీ
ప్రయాగ గయ సింహగిరి శ్రీకూర్మ్మ
పురుషోత్తమాది పుణ్యస్థాన స్థాపితానేక
సువర్ణ కలశ రజత హేమపాత్ర
పల్లవత్రినేత్ర
నిత్య పరిపాలిత సత్య
పల్లవాదిత్య
దుర్మ్మదవైరివీరభయంకర
బసువ సంకర
క(లి) కాల భంజిత ధర్మ్మ వృష
భావికల సంచార కరణ
చిత్రప్రభావ దుండిననావ
విక్రమ పంజర నిగ్రహీత రిపురాజసింహ
పాండ్యరాయ గజసింహ్వ
బ్రహ్మకుండి కృష్ణవేణా
గౌతమీతీరదత్తానేకాగ్రహార
అనేక పుణ్యక్షేత్ర సత్ర సంపాదిత
చతుర్వ్విధాహార
విజయ కుంజరాలాన నిజ భుజ
స్తంభ సంభృత యశోమండన
అళియ నరద శిరః ఖండన
ప్రజా ప్రవర్తిత చతుర్వ్విధోపాయ
కేళాది రాయ
పర పుర హరణ మృత్యుంజయ
సంగ్రామధనంజయ
రాజ్య రమారమణీ స్వయంవరలబ్ధ నాయక సౌభాగ్య
మహనీయ్యాంధ్ర దేశపట్టాభిషిక్త
సంవృత మహాభాగ్య బహు సహస్ర సువర్ణ
దాన సంతోషిత మహాకవీశ్వర
పూర్వ్వ సముద్రాధీశ్వర
ఘనసార కస్తూరికాది వస్తు విస్తార
విరచితాపూర్వ్వ వసంతవిహార
పరిగ్రహీత నూతన మదనావతార

విరచిత బ్రహ్మాండ దాన కనక ధారా దాన
గోసహస్ర దానా కల్పతరుదాన
సంతత నిర్వర్తిత సర్వ సంతాన
సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠా
పిత కీర్తి స్తంభ
విజయ రమాప (తి) రంభ
సంగర గౌతమీ సలిల (సంగమ)
సకల జలదుర్గ సాధన రఘురామ
రాజమహేంద్ర నిరవద్య నగరాది బహువిధ
స్థల దుర్గ వర్గ విదళన బలరామ
సంగ్రామ సత్ర సంతర్పితభూత బేతాళ
కలియుగ భేతాళ
పరిచితానేకగతి విశేషవారణమారణోపాయ
క్షురికా సహాయ
విశ్వజనహితపవిత్రచారిత్ర
వెర్లిచెరి గోత్ర
ఉత్తుంగ చతురగచ...బలవైరి సేనాసాధక

శ్రీపర్వత . శిరోమణి శ్రీ కుమారగిరి శ్రీమత్రిపురాంతకదేవ దివ్యశ్రీ పాదపద్మారాధక వేమభూపాల వంశాంబుధి సంపూర్ణచంద్ర శ్రీ యన్నవేమ నరేంద్ర విజయీభవ

## బిరుదావళి వివరణ

1. చంచుమలయ చూరకార: (రెడ్డిరాజులు కృతిబొందిన కొన్ని కావ్యములలో చెంజి మలచూరకారయనిగూడ గలదు). శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు విజ్ఞానసర్వస్వము పుట 307 లో యీ బిరుదు నీ విధముగ వివరించిరి. 'చెంజిమల యనగా దక్షిణార్కాటులోని జింజి దుర్గము. చెంచుమల యన్నది అహోబలము కావచ్చును చెంచుమల అహోబలమైనచో ప్రోలయ వేమారెడ్డి అరవీటి సోమదేవ రాజు హవళిలో దానిని చూరగొని ఆ బిరుదును వహించి యుండవచ్చును. చెంజిమల (జింజిదుర్గము) అయినచో ప్రోలయ వేమారెడ్డికి ఈ బిరు దతని పూర్వులనుండి సంక్రమించినట్లు తలంపవలసి యున్నది ప్రోలయవేమునితండ్రి కాకతి ప్రతాప రుద్రుని సైన్యాధిపతులలో నొక్కడుగనుండి క్రీ. శ. 1315 లో కాకతి ప్రతాపరుద్రుని సర్వసేనానియగు ముప్పిడి నాయకుడు పాండ్యులను జంబుకేశ్వరము వరకు తరిమిన సందర్భములో ప్రోలయ (వేముని తండ్రి) జింజిని కొల్లగొట్టి యీ బిరుదును వహించియుండును ఈ బిరుదువలన వేమారెడ్డి తండ్రి ప్రోలయరెడ్డి కాకతిప్రతాపరుద్రుని 72 మంది నాయంకరాధిపతులలో నొకడై ఆ చక్రవర్తి దాడులలో ప్రముఖపాత్ర వహించియుండునని తలంప వచ్చును

2. విశ్వవిశ్వంభరాభరణదక్షదక్షిణభుజాదండ: ఈ బిరుదు రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయవేముడు తాల్చెను. ఓరుగల్లు పతనానంతరము యవనుల గుప్పుపడియను మహాసముద్రమున మునిగియున్న భూమిని, ప్రోలయవేముడు తన విజయధాటిచే లేవనెత్తి నిజభుజమున దాల్చి సముద్ధరించి తన దక్షత జూపెనని యీ బిరుదు తెల్పును. ఇదే విషయము ఎఱ్ఱాప్రగడ తన హరివంశములో పూర్వభాగములో 5 - 260 పద్యములో సూచించెను.

మాలిని: యవననృపబలాబ్ధిన్వ్యాపి ఖడ్గోర్వివేగా !
జవనహయఖురాగ్రచ్ఛాది భూమ్యంతభాగా
భువనభరితలక్ష్మీబద్ధనిత్యానురాగా
భువనయుగపోత్రిస్ఫూర్తిమత్త్యాగభోగా.

ఇదే విషయము శ. స 1312 నాటి అనుపర్తి శాసనములోగూడ చెప్పబడెను (పంక్తులు 12—15)

3. జగనొబ్బగండ: జగదేకవీరుడు. ఈ బిరుదు హొయిసల వీరనరసింహుని కుమారుడైన కర్నాటసోమేశ్వరుని సేనానులగు అప్పయ గొప్పయ లనువారు వహించిరి. శ స 1162 (క్రీ. శ. 1240) ప్రాంతములో కాంచీపురప్రాంతములో చోళపల్లవహొయిసలులమధ్య జరిగిన యుద్ధములలో పాల్గొనిన వేమారెడ్డి పూర్వులు [illegible] కర్నాట సేనానులను జయించి వారి బిరుదులను తాము వహించిరి రెడ్డిరాజ్య స్థాపకుడైన వేమారెడ్డి

పూర్వుల చరిత్ర వారి శాసనములవలన మన కేమియు తెలియకపోయినను యీ బిరుదువలన వారి పూర్వులు నెల్లూరుచోళుల సామంతులుగనుండి వారి దండయాత్రలలో పాల్గొనినట్లు మనము తలంప వచ్చును. ఇదేబిరుదు కొప్పులవంశీయులకు గూడ గలదు. అనవోతారెడ్డి తన పూర్వదిగ్విజయయాత్రలో కొప్పుల ముమ్మడినాయకుని ఓడించి, తన సామంతు నిగ జేసుకొని వారి బిరుదును దాల్చెననిగూడ చెప్పవచ్చును.

4. ఆనయమండలీకరగండ : ఈ బిరుదు ప్రోలయవేమారెడ్డి సంపాదించినట్లు కనపడును. ఆనయమండలమన ఆనెగొంది ప్రాంతము. యవనుల దక్షిణదేశ మారణహోమ సందర్భములో క్రీ. శ. 1329 ప్రాంతములో కంపిలి (విజయనగరరాజ్య స్థాపనకు పూర్వము హంపీప్రాంతమున వర్ధిల్లిన చిన్నరాజ్యము) ప్రాంతపు ప్రజలు తత్ప్రాంతాధిపతి యైన మహమ్మదీయ పాలకునిపై తిరుగుబాటు జేసిరి. అరవీటివారి పూర్వులైన చాళుక్య వంశజుడగు సోమదేవరాజు ఆ తిరుగుబాటుకు నాయకత్వము వహించి ఆనెగొంది మొదలైనచోట్ల యవన సైన్యములతో యుద్ధములుజేసి వారిని ఓడించెను. ప్రోలయవేమారెడ్డి ఆ తిరుగుబాటులో ప్రముఖపాత్ర వహించి, సోమరాజుకు తోడ్పడి ఆనెగొంది ప్రాంతమును స్వాధీనపరచుకొని 'ఆనయమండలీకరగండ' బిరుదును దాల్చెను.

5. రాయచకోలుగండ : విరోధులైన రాచ వారిని వశపరచుకొని యీ బిరుదును వహించి యుండును.

6. అర్థిజన ప్రత్యర్థిజన హేమాద్రిదాననిరత : ఈ బిరుదుగూడ ప్రోలయవేమారెడ్డి సంపాదించు కున్నది: హేమాద్రిరచిత చతుర్వర్గచింతామణిలోని దానకాండలో చెప్పిన దానములన్నియు అర్థించినవారికి అర్థించనివారికిగూడ నిరంతరము తుచ తప్పకుండ దానములు చేయుటను తెల్పు బిరుదు. యవనుల అత్యాచారముల ఫలితముగా హిందూసంస్కృతి మట్టి పాలైన కాలములో ప్రోలయవేముడు పరమధార్మి కుడై తిరిగి దానిని పునరుద్ధరించుట యందెంతో ఉత్సాహము చూపెననుటకు ఈ బిరుదొక మచ్చుతునుక.

7. ప్రజాపరిపాలనాచతుర : యవనులచే తారుమారు చేయబడిన ప్రజాపరిపాలనను చక్కబెట్టి ప్రజారంజకముగా పాలించుటయందు నేర్పు చూపిన వాడు.

8. వీరనారాయణ : కాకతీయరాజ్య పతనా నంతరము యవనుల స్వాధీనములోనున్న దేశమును రక్షించి ప్రోలయ వేముడీ బిరుదును దాల్చెను.

(రెడ్డిరాజులు తమ శాసనముల చివర 'పల్లవత్రి నేత్ర–వీరనారాయణ'యని వ్రాలుజేయు నాచారము గలదు.) ఎఱ్ఱాప్రగడ ప్రోలయవేము నిట్లు కీర్తించెను.

క॥ నారీరమణరమాత్మజ
నారాయణ సదృశ వీరనారాయణ నా
నారణ వర్తిత నారద
నారాచ క్షుభ్య దన్య నరవర సైన్యా
(హరివంశము పూ. భా. అ- 9–227 ప)

9. భుజబలభీమ : భుజబలమందు భీమునితో సమానమైనవాడు; సమస్త శత్రువులను నాశనము జేయు ప్రజ్ఞను పాలించినవాడు.

10. అపరిమిత భూదానపరశురామ: ప్రోలయ వేమారెడ్డి, రెడ్డిరాజ్యమును స్థాపించిన తర్వాత, కాకతీయరాజ్యపతనానంతరము యవనులు బలవంత ముగా ఆక్రమించుకొనిన బ్రాహ్మణాగ్రహారములను, భూవసతులను ఎవరివివారికిచ్చుటయేగాక తాను పరమ ధార్మికుడై బ్రాహ్మణుల కనేక భూదానములు జేసి పరశురామునంత కీర్తి సంపాదించెనని యీ బిరుదు తెల్పును.

11. అనేక నగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహువిధారామ : రెడ్డిరాజులు తమ రాజ్యములోని నగర ప్రాంగణములలో ప్రజోపయోగమునకై అనేక ఫల వృక్షములుగల తోటలను నిర్మించి కీర్తి బొందిరి.

(ఆరామ నిర్మాణము సప్త సంతానములలో నొకటిగ పరిగణింపబడెను. పండ్లతోటల నిర్మాణము ప్రోలయవేము డొక వ్యసనముగ పరిగణించునట్లు ఎఱ్ఱాప్రగడ సాక్ష్యము గలదు.–(చూ. ఎఱ్ఱాప్రగడ హరివంశము, పూ. భా. అ. 1–19)

12. సంగడిరక్షపాల : శస్త్రాహతులై యుద్ధమునుండి తొలగిపోవు భూపతులను రక్షించువారికి ప్రోలయవేముడు పాలకుడు.

13. జగరక్షపాల : తన్ను ఆశ్రయించిన వారిని రక్షించి ధర్మోపదేశముచే ప్రజలను పాలించువాడు.

14. జగదుగోపాల : భూమిని (రాజ్యమును) రక్షించుటలో గోపాలమూర్తి అంతవాడు. (12, 13, 14 సంఖ్యలలోని బిరుదులు కాకతీయరాజ్య పతనానంతరము హిందూసంస్కృతిరక్షణకొరకు జరిపిన పోరాటమునకు నాయకత్వము వహించిన కాపయ నాయకుడుగూడ దాల్చెను) ఎఱ్ఱాప్రగడ తన హరివంశములో తన కృతిపతియగు వేమునకీ బిరుదములు గలవని చెప్పెను.

15. గుజ్జరితట్టివిభాళ : ఇదిగూడ ప్రోలయ వేమునికి సంబంధించిన బిరుదు. క్రీ. శ. 1326–27 ప్రాంతములో కాకతీయ సామ్రాజ్య పతనానంతరము కంపిలి రాజ్యము ఢిల్లీ సుల్తాను అధికారమునకు లోబడక తిరుగుబాటు జేసెను. ఆ సందర్భములో ఢిల్లీ సుల్తాను కంపిలి తిరుగుబాటు నణచుటకు తన గుజరాతుసైన్యవిభాగమును పంపెను. ప్రోలయ వేమారెడ్డి కంపిలిముట్టడిలో సుల్తాను సైన్యమును పూర్తిగ ఓడించి యీ బిరుదును దాల్చెను (ఎఱ్ఱాప్రగడ హరివంశములో యీ బిరుదును ముచ్చటించెను.)

16. రాచూరి దుర్గవిభాళ : తుగ్లక్ దక్కను నుండి వెడలిపోయిన తర్వాత కంపిలిప్రాంతపు ప్రజలు క్రీ. శ. 1329 ప్రాంతములో తిరుగుబాటొనర్చిరి. ఆరవీటి వారి పూర్వులైన చాళుక్య వంశజుడగు సోమదేవరాజు నాయకత్వము వహించి అనేక కోటలను స్వాధీనపరచుకొనెను. ఆ సందర్భంలో ప్రోలయ వేమారెడ్డి కాపయ నాయకునకు విధేయుడై సోమదేవరాజుతో కలిసి రాచూరుకోటను పట్టుకొని యీ బిరుదు దాల్చెను.

17. అనవరత దత్తావేకాగ్రహార భూదేవ కారిత సోమపాన ; ఇదిగూడ ప్రోలయవేముడు వహించిన బిరుదే. యవనులచే నాశనము చేయబడిన దేవాలయములను పునరుద్ధరించి దేవతాప్రతిమలను పునఃప్రతిష్ఠగావించి, యజ్ఞములు మొదలైన వైదికకర్మలు నిర్బాధకముగా అనుష్ఠితముగునట్లు జేసి భూసురులు అనవరతము తమ అగ్రహారములలో నిర్వహించు యజ్ఞముల సోమపానమును స్వీకరించుటయందభిలాష గలవాడని యీ బిరుదు తెల్పును.

18 శ్రీపర్వత అహోబల నిర్మిత సోపాన : రెడ్డిరాజులు వహించిన బిరుదులలోని కెల్ల ముఖ్యమైనది. ఈ సోపాన నిర్మాణము దాదాపు వారు వేయించిన అన్ని శాసనములలోను బేర్కొనబడెను. రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి కృష్ణా నదీ తీరమున మల్లికార్జునస్వామి, భ్రమరాంబల నిలయమగు శ్రీశైలమందు పర్వతశిఖరాగ్రము నుండి మూడుమైళ్లుదిగి పాతాళగంగయను తీర్థమున యాత్రికులు కృష్ణానదిలో స్నానము జేయుటకు వీలగునట్లును, నృసింహస్వామి నిలయమగు అహోబల క్షేత్రమందు స్వామిదర్శనమునకు అహోబల గిరినెక్కుటకు వీలగునట్లును సోపానముల నిర్మించెను ఈ సోపాన నిర్మాణము క్రీ. శ. 1335 నాటి చీమకుర్తి శాసనములో మొదటిసారిగ ప్రస్తావించ బడెను. అందువలన ఆ నిర్మాణము క్రీ. శ. 1335 నాటికి పూర్తి చేయబడెను. దీనివలన ప్రోలయ వేముని కాలములో రెడ్డిరాజ్యము పడమరవైపు శ్రీశైలాంతకమువరకు వ్యాపించినదని చెప్పవచ్చును. దీని వలన ఇంకొక ప్రయోజనమేమన రెడ్డిరాజులు శైవులయినను విష్ణుద్వేషము లేనివారని చెప్పవచ్చును. అన్నిటికన్న ముఖ్యమైనదేమన యీ సోపాన నిర్మాణము ఎఱ్ఱాప్రగ్గడ తన హరివంశములో ప్రస్తావించనందున ఆ కావ్యము క్రీ. శ. 1335 నాటికే పూర్తియైనదని చూపవచ్చును.

19. పంచారామ ప్రతిష్ఠిత గజఘంటానినాద వర్ధిత కీర్తిఘంటానాద : శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామ మధ్యస్థ త్రిలింగభూమి (ఆంధ్రదేశము) యందలి పంచారామముల యందు

నెలకొల్పిన గజఘంటల ధ్వనివలన కీర్తిని వ్యాపింప జేయుననుట దీని యర్థము. పంచారామములు (1) దాక్షారామము (2) భీమారామము (3) క్షీరా రామము (4) అమరారామము (5) కుమారా రామము: ఈ అయిదు ఆరామములు శివుని విహార ప్రదేశములని పురాణ ప్రసిద్ధి. ఈ బిరుదును బట్టిన్నీ, అనవేమారెడ్డి శ్రీశైలములో తన తండ్రి పుణ్యమునకు నిర్మించిన వీరమంటపమును బట్టిన్నీ, రెడ్డిరాజులు (వీర) శైవులని విదితమగును. కాని వారు విష్ణ్వాలయములకుగూడ దానము లిచ్చి అహోబిలములో సోపానములు నిర్మించుట మొదలైన పుణ్యకార్యములవలన వారు వైష్ణవ ద్వేషులు కారనవచ్చును.

20 కరవాళ వైనతేయ ఖండిత విమత వ్యాళ: విరోధి ఏనుగులను తన ఖడ్గముతో నేర్పుగా సంహరింపగలవాడు. వెనుకటి శతాబ్దములలో యుద్ధ విభాగములో గజదళవిభాగము చాల ముఖ్య విభాగము. అనవేమారెడ్డి ఏనుగుల మారణోపాయ కీలకము బాగా తెలిసినవాడు. అందువల్ల ఏనుగులను వధించుటలో నేర్పు జూపి జయములనుగాంచి యీ బిరుదు దాల్చెను.

21. దివి జల దుర్గ విభాళ: ద్వీపము అను నామాంతరము గల దివి దుర్గమును పట్టుకొనుటవలన ప్రాప్తించిన బిరుదు. ఇది కృష్ణాజిల్లా బందరు తాలూకాలోని తలగడదీవి. దీనిని మొదటి సారిగ అనవోతారెడ్డి జయించెను. కాని ఆ దుర్గ పాలకులు మరల ఆ కోటను మరమ్మత్తు జేసుకొని ఎక్కువ కట్టుదిట్టము జేసుకొనిరి. అయితే అనవేమారెడ్డి తన పూర్వదిగ్విజయయాత్రలో తొలుదొల్త యీ దుర్గమునే సాధించి దానిని పట్టుకొని 'దివి జల దుర్గ విభాళ'' యను బిరుదును వహించెను.

22. కుండినదీ సహ్యజా గౌతమీ జలక్రీడా వినోద: గుండ్లకమ్మ, కృష్ణ, గోదావరి నదులలో జలక్రీడలతో వినోదించువాడని యీ బిరుదు తెల్పును. ఈ బిరుదువలన రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి సంపాదించిన రాజ్య విస్తీర్ణమును చాటును. ఈ మూడునదులు ఆ రాజ్యమునకు సరిహద్దులని చెప్పవచ్చును. తర్వాతి రాజులగు అనవోతారెడ్డి, అనవేమారెడ్లనేక యుద్ధములుజేసి సరిహద్దులను విస్తరింపజేసి రెడ్డిరాజ్యముయొక్క ప్రతిష్ఠను ఇనుమడింపజేసి గొప్ప కీర్తి నార్జించిరి.

23. శ్రీశైల త్రిపురాంత కాహోబల కాశీ ప్రయాగ గయ సింహగిరి శ్రీ కూర్మ పురుషోత్తమాది పుణ్యస్థాన స్థాపితానేక సువర్ణ కలశ రజతహేమపాత్ర: ఈ బిరుదువలన రెడ్డిరాజు లెంత దైవభక్తిగలవారో మన మూహింపవచ్చును. ఆంధ్రదేశములోని పుణ్యక్షేత్రములగు శ్రీశైలము, త్రిపురాంతకము, అహోబలము, సింహగిరి, కళింగములోని శ్రీకూర్మము, పురుషోత్తమము (కటక్), ఉత్తరహిందూదేశములోని ప్రయాగ, గయ మొదలైన ప్రదేశములలో బంగారుకలశపాత్రలను నెలకొల్పి కీర్తి గాంచినారు. (ఈ బిరుదులో చెప్పిన కాశీ, ప్రయాగ, గయ యను మూడు పుణ్యక్షేత్రములుతప్ప తక్కినవన్నియు శా. శ. 1257 క్రీ. శ. 1335 నాటి చీమకుర్తి శాసనములో పేర్కొనబడెను. అది ప్రోలయవేమారెడ్డికాలము నాటిది. కాని History of the Reddi Kingdoms[1] వ్రాసిన యం సోమశేఖరశర్మగారు చీమకుర్తి శాసనపు ఉనికినే కొన్నికారణములు చూపుచూ సందేహించిరి వారి సందేహమే నిజమనుకొనిన పై పుణ్యస్థలములలో బంగారుకలశములు అనవేమారెడ్డిగారు పూర్వదిగ్విజయయాత్ర ముగించినతర్వాతనే స్థాపించుట కవకాశమున్నదని, యీ బిరుదు వారికి చెందునని చెప్పవచ్చును )

24. పల్లవత్రినేత్ర; నిత్యపరిపాలితసత్య; పల్లవాదిత్య: ఈ మూడు బిరుదులు రెడ్డిరాజులు వేయించిన అన్నిశాసనములలోను కనుపించును. రెడ్డిప్రభు

1. చూడుడు: యం. సోమశేఖరశర్మగారి 'History of Reddi Kingdoms—Page 92— A Note on the Chimakurti plate of Anavema.

వులు వ్రాయించిన దానశాసనముల చివర - 'పల్లవ త్రినేత్ర — వీరనారాయణ' యని వ్రాయించుచూ వచ్చిరి. దీనికి సంబంధించిన గాథ : క్రీ. శ. 350 ప్రాంతమున ముక్కంటికాడువెట్టియను పల్లవ రాజొకడు తొండమండలప్రాంతమును పాలించు చుండెడువాడు. ఈ ముక్కంటికాడువెట్టి వృత్తాంతము క్రీ. శ. 10, 11 శతాబ్దములనాటి తెలుగు చోడుల శాసనములలోను, తిక్కన నిర్వచనోత్తర రామాయణమందును చెప్పబడెను. ముక్కంటికాడు వెట్టికి త్రిలోచనపల్లవుడనియు, ముక్కంటి పల్లవుడనియు, నామాంతరము లున్నట్లు శాసనముల వలన తెలియును. 'కాడువెట్టి' అనగా అరవములో భూమిని వ్యవసాయయోగ్యము జేయుట యను నర్థము గలదు త్రిలోచన పల్లవుడనునది ముక్కంటికాడు వెట్టికి సంస్కృతీకరణము. త్రిలోచన పల్లవునికి ఆంధ్రదేశచరిత్రతో గాఢమైనసంబంధము గలదు. శ్రీశైలమునకు ఆగ్నేయమున బలిసియుండిన అడవులను కొట్టించి దేశము నివాసయోగ్యముజేసి ఆ ప్రదేశములో బ్రాహ్మణులకు అనేకాగ్రహారముల నిచ్చెను. ఒక్కొక అగ్రహార మొక్కొక వైదిక విద్యా నిలయముగజేసి ఆర్యధర్మము నుద్ధరించెను అతని కాలములో ఆర్యధర్మము వైదికసంస్కృతి పరాకాష్ఠ నొందెను. రెడ్డిరాజులు యవనదురాక్రమణానంతరము పల్లవత్రినయనునిమాదిరి ఆర్యసంస్కృతిని నిలబెట్టుటకు కంకణము కట్టుకొని వైదికవిద్యలో ఆరితేరిన బ్రాహ్మణులకు అగ్రహారముల నిచ్చి, యవనులచే లాగుకొనబడిన అగ్రహారములను తిరిగి ఎవరివి వారి సంతతివారికి ప్రాప్తించునట్లుజేసి 'పల్లవ త్రినేత్ర' యను బిరుదును దాతపేరునకుకల్పి శాసనముల చివర వ్రాలునుంచెడివారు. ఎల్లప్పుడు, పల్లవాదిత్యునిమాదిరి సత్యపరిపాలనయం దభిలాష చూపిరని మన వీా బిరుదులవలన గ్రహింపవచ్చును. ఈ బిరుదులు వహించుటవలన ఇంకొక విషయము గూడ సూచింపబడినట్లు తలంపవచ్చును ఈ రెడ్డిరాజుల పూర్వులు మొదటి పల్లవ నరపతులైన వారితోడ బంధుత్వము గల్గియుందురని తలంచుట కవకాశము గలదు. రెడ్డిరాజుల మొదటి నివాసము పంటరాష్ట్రము. అందువలన వీరు పంటరెడ్లనియు, పంటకాపులనియు గ్రంథసాక్ష్యము గలదు. పురాతన రాష్ట్రభాగములలో పంటరాష్ట్ర మొక విభాగము. ముండెంబాక పరిసరములను వెనుకటి శతాబ్దములలో పంటరాష్ట్ర మనిరి ఆ ప్రాంతము తొండమండలము లోని విభాగమై చాలకాలము పల్లవుల పరిపాలన క్రింద నుండుటవలన రెడ్డిరాజుల పూర్వికులు పల్లవుల సంతతి వారనవచ్చును. కాని అట్టిది నిర్ధారణ జేయుటకు శాసనాధారము లిప్పటివరకు దొరకలేదు.

25. దుర్మద వైరి వీర భయంకర : మదించిన వైరి వీరుల పొగరణచు శక్తి సామర్థ్యములు గలవాడు.

26. బసువ సంకర : (ప్రోలయవేముని మంచళ్ల శాసనములో 17వ శ్లోకములో పూర్తి బిరుదు చెప్పబడెను– చూ. రెడ్డిసంచిక– అనుబంధము 1. పుట. 5). విరూపాక్షముద్రలుగల దాత ప్రతిగ్రహీతల వంశ వర్ణనలచే నొప్పునట్టి తామ్ర శాసనములచే చిరస్థాయి గలిగిన కీర్తివంతులని దీని అర్థము.

27. క (లి) కాల భంజిత ధర్మవృషభావికల సంచార కరణ: కాకతీయరాజ్యపతనానంతరము యవనుల దురాచారములచే కలియుగధర్మములైన వేద క్రతువులు, వర్ణాశ్రమధర్మములు స్తంభించిపోయెను. దేశమంతయు భయభ్రాంతులతో తాండవమాడెను. అట్టిస్థితిలో రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయ వేముడు కలియుగధర్మములను పునఃప్రతిష్ఠించుటకు బద్ధకంకణుడై యవనులచే బలవంతముగ తీసుకొనబడిన బ్రాహ్మణాగ్రహారములను, భూములను ఎవరివి వారికిప్పించి సర్వశాస్త్రములు, వేదములు, క్రతువులు, మున్నగునవి మరల సక్రమముగ భూసురులచే నిర్వహింపజేసి, అనేక దేవతాప్రతిష్ఠలుజేసి కలికాల సర్వధర్మముల నుద్ధరించి యీా బిరుదును దాల్చెను.

28. విక్రమ పంజర నిగ్రహీత రిపు రాజ సింహ : విరోధులను సింహములను తన సాహసమను బోనులోనుంచు శక్తి గలవాడు. ఈ బిరుదు అన

వేమారెడ్డికి వర్తించును. అనవేమారెడ్డి అతిసాహసుడై అనేకమంది రాజులను ఓడించి వారిని భయభ్రాంతులను జేసెను

29 పాండ్యరాయ గజసింహ్వ : పాండ్యరాజను ఏనుగునకు కేసరివంటివాడు. ఈ బిరుదు ప్రోలయ వేమారెడ్డి తండ్రి ప్రోలయ క్రీ: శ. 1316 ప్రాంతములో కాకతి ప్రతాపరుద్రుని కాంచి దండయాత్రలో ముప్పిడి నాయకునికి కుడిభుజముగానుండి పంచపాండ్యరాజులను ఓడించినందువల్ల వచ్చిన బిరుదై యుండును.

30. బ్రహ్మకుండీ కృష్ణవేణా గౌతమీతీర దత్తానేకాగ్రహార : [ఈ బిరుదు ప్రోలయవేముని మల్లవర శాసనమందు గూడగలదు] గుండ్లకమ్మ, కృష్ణ, గోదావరినదుల తీరప్రాంతములలో యవనుల విజృంభణలో పోగొట్టుకొనిన బ్రాహ్మణుల అగ్రహారములను ప్రోలయ వేమారెడ్డి ఉద్ధరించి హిందూ ధర్మ స్థాపకుడయ్యెనని యీ బిరుదు తెల్పును.

31. అనేక పుణ్యక్షేత్ర సత్ర సంపాదిత చతుర్విధాహార : అనేక పుణ్యక్షేత్రములలో యాత్రికుల వసతి కొరకు సత్రముల నిర్మించి ఆ సత్రములలో అన్నివిధములైన భోజనవసతులు కల్పించిరని యీ బిరుదు తెల్పును. సప్తసంతానములలో 'సత్రములు నిల్పుట' ఒక పుణ్యకార్యము ఈ బిరుదు ప్రోలయ వేమారెడ్డి సత్రములుకట్టించి వసతులు ఏర్పరచినందువలన వచ్చిన బిరుదు.

32. విజయకుంజరాలాన నిజ భుజ స్తంభ సంభృత యశోమండన : తన భుజ బలమువలన విరోధులను అవలీలగా స్వాధీనము జేసుకొనగలడను కీర్తి సంపాదించినవాడు.

33: అళియవరదశిరః ఖండన : ఈ బిరుదుతోపాటు యీ శాసనములో చెప్పబడనటువంటి 'అప్పయ గోపయ దిశాపట' బిరుదు ప్రోలయ వేముని పూర్వులు తాముజేసిన యుద్ధములలో విజేతలై, ఓడినవారి బిరుదులను తాము వహించిరి. వాటిని రెడ్డిరాజులు పారంపర్యముగా దాల్చిరి. "అప్పయ గోపయులు, ఆళియవరదుడు రెండవ వీర నరసింహదేవుని సైన్యాధిపతులు. మూడవ రాజరాజ చోళ చక్రవర్తిపై కావడ (పల్లవ) భూపతియైన కొప్పెరజింగదేవరాజు తిరుగుబాటుజేసి అతనిని బంది జేసినప్పుడు అతనిని విడిపించి పల్లవరాజును శిక్షించుటకై వీరనరసింహదేవుడు తన సేనాధిపతులను పంపెను. శ స 1153 [క్రీ. శ. 1231] నాటి కాంచీపురములోని శాసనములవలన అప్పయ దండనాయకునకు దండెనగోప (వ), జగదొబ్బగండ బిరుదులు గలవు. నెల్లూరు అధిపతియైన తెలుగు చోడ భూపతి మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు గూడ ఆ దండయాత్రలో పాల్గొని హొయిసల వీర నరసింహుని కుమారుడైన కర్ణాట సోమేశ్వరు నోడించెను. ప్రాయికముగ కొండవీటి రెడ్ల పూర్వీకులు నెల్లూరి తెలుగుచోడ భూపతి తిక్కరాజు కొలువునందుండి పూర్వోక్త యుద్ధములలో పాల్గొని కర్ణాటసేనానులను జయించి వారి బిరుదులను తాము వహించినట్లు యీ బిరుదు తెల్పును. దీనిని బట్టి ప్రోలయవేముని తండ్రి తాతలు, పంటరాష్ట్రవాసులై చోడులవద్ద సైన్యాధిపతులుగనుండి యుద్ధములు జేసిరని తెలియును.

34. ప్రజా పరిచిత చతుర్విధోపాయ : సామాన్యప్రజకు తెలియనటువంటి సామ దాన భేద దండోపాయములను నాలుగు విధములైన నేర్పులతో ప్రత్యర్థులను లొంగదీయు సామర్థ్యము గలవారు. అనవేమారెడ్డి సాధించిన విజయములవలన ఈ బిరుదతనియందు సార్థకమని చెప్పవచ్చును.

35. కేళాదిరాయ: ఈ బిరుదు ప్రోలయ వేమారెడ్డి కాలమునుండి అందరు రెడ్డిప్రభువులు దాల్చిరి. ఈ వంశీయులు సాహిత్య ప్రియులేకాక, సంగీతమునందు కూడ చాల రసికులు ఎఱ్ఱాప్రగడ తన కృతిపతియగు ప్రోలయవేముని గుణములను వర్ణించుసందర్భములో అతడు "కేళాదిరాయ వితరణ కేళీ నిరపాయ నృత్య గీత కథా లీలా లలితోత్సవ నిరంతరాశయాలంకృతభాగ్య" యని చెప్పెను.

36 పర పుర హరణ మృత్యుంజయ: శత్రు

వుల పురములను కాల్చుటలో ముక్కంటి యంత వాడు. ఈ బిరుదు ప్రోలయవేముని శాసనములలో పేర్కొనబడెను

37. సంగ్రామ ధనంజయ : యుద్ధము లలో భీష్మ దుర్యోధను లటువంటివారగు శత్రు భూపాలురను జయించినందువలన ఈ బిరుదు ప్రోలయవేమునియందు సార్థకమయ్యెను.

38. రాజ్య రమారమణీ స్వయంవర లబ్ధ నాయక సౌభాగ్య: ఈ బిరుదు అనవేమారెడ్డికి వర్తించును. దీనివలన అనవేమారెడ్డి ఎట్టిస్థితిలో రాజ్య భారము వహించెనో తెలియును. అనవోతారెడ్డి తర్వాత అతని కుమారుడగు కుమారగిరిరెడ్డి రాజ్యమునకు పట్టాభిషిక్తుడు కావలసియుండెను. కాని అట్లు జరుగలేదు. అనవోతారెడ్డి కుమారునికిబదులు తమ్ముడు రాజ్యము చేపట్టుటలో ఒక పరమార్థ మున్నదని చరిత్రకారు లూహించిరి. (1) అనవోతారెడ్డి కుమారుడు కొమరగిరిరెడ్డి రాజ్యభారము వహించునంతటి యీడులేనివాడై యుండనోపు (2) అనవోతారెడ్డి మరణకాలమునకు తాను యుద్ధములు జేసి సంపాదించిన రాజ్యము చాలమట్టుకు విరోధుల స్వాధీనమై రెడ్డిరాజుల గౌరవ ప్రతిష్ఠలకు భంగము వాటిల్లు స్థితి ఏర్పడెను. అందువలన ఉన్నరాజ్యమును దక్కించుకొనుటయేగాక అన్నగారిచేతినుండి జారి పోయి అన్యరాజాక్రాంతమైన రాజ్యమును తిరిగి సంపాదించి అడుగంటిన రెడ్డిరాజుల ప్రతిష్ఠను తిరిగి నెలకొల్పు టవసరమయ్యెను. విజయనగర, కళింగ రాజ్యాధిపతుల విజృంభణమువలన ఏర్పడిన ముప్పు తప్పించి రాజ్యమును సుస్థిరము జేయుటకు సమర్థతగల వ్యక్తి కావలసియుండుటవలన మంత్రులు, దండనాథులు, సామంతమండలేశ్వరులు, అప్పటి రాజకీయపరిస్థితిని చర్చించి, బలప్రతాపాఢ్యుడైన అనవేమారెడ్డిని ఎన్నుకొనినట్లు కాన్పించును. అందు వలననే 'తాను రాజ్యలక్ష్మిచేతపతిగా వరింపబడి నాయకత్వ సౌభాగ్యమును బొందితి'నను బిరుదును వహించెను.

39 మహనీయాంధ్రదేశపట్టాభిషిక్త: అనవేమారెడ్డి అనేక యుద్ధములుజేసి తన సామ్రాజ్యమును కర్నూలుజిల్లాలోని శ్రీశైలమునుండి తూర్పు సముద్రము వరకును, విశాఖపట్టణం జిల్లాలోని సింహాచలమునుండి నెల్లూరుజిల్లాలోని కందుకూరువరకు వ్యాపింపజేసి మహనీయాంధ్ర దేశ పట్టాభిషిక్తుడయ్యెనని ఈ బిరుదు సూచించును.

40. సంభృత మహాభాగ్య బహుసహస్ర సువర్ణ దాన సంతోషిత మహాకవీశ్వర: పండితులను కవులను అనేక విధములైన సువర్ణదానములతో సంతోషింపజేయువాడని ఈ బిరుదు తెల్పును. అనవేమారెడ్డి ఆస్థానములో త్రిలోచనాచార్యుడు, ప్రకాశభరతి యోగి మొదలైన ఉద్దండపండితులుండిరి. బాలసరస్వతి ఆస్థాన కవి. వెన్నెలకంటివారు అనవేముని కనేక కృతులనిచ్చి ఆదరింపబడిరి.

41. పూర్వ సముద్రాధీశ్వర: రెడ్డి రాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి తమ్ముడగు మల్లారెడ్డి తూర్పుసముద్రతీరమున బాపట్లకు 17 మైళ్ల దూరములోనున్న మోటుపల్లి యనురేవు పట్టణమును స్వాధీనపరచుకొని దానిని అన్నగారి పరిపాలనక్రింద నుంచెను. 12, 13 శతాబ్దములలో మోటుపల్లి గొప్ప రేవు పట్టణముగానుండి సముద్ర వ్యాపారమునకు కీలక స్థానముగ నుండెను. ఈ రేవు పట్టణము స్వాధీనములో నున్నంతవరకు దాని ద్వారా తూర్పు సముద్రమున కధీశ్వరులగుదురు. ఈ బిరుదు ప్రోలయవేముని శాసనములలో గూడ చెప్పబడెను. అనవోతారెడ్డి మోటుపల్లిద్వారా తూర్పు దేశములతో విరివిగా వర్తకవ్యాపారములు సాగుటకు క్రీ. శ. 1358 లో ఒక అభయ శాసనమును మోటుపల్లిలో నెలకొల్పెను.

42 ఘనసార కస్తూరికాది వస్తు విస్తార విరచితాపూర్వ వసంత విహార; ఈ బిరుదువలన 'వసంతోత్సవములు' రెడ్డి రాజుల కాలములో అనవేమారెడ్డి కాలమునగూడ విరివిగా జరుగుచుండెనని గ్రహింపవచ్చును. ఈ వసంతోత్సవములు కొమరగిరి రెడ్డి కాలములో పరాకాష్ఠ నొందెను ఆ కాలములో జాతీయమైన పండుగలలో ఈ వసంతోత్సవము గొప్ప జాతీయ ఉత్సవముగా పరిగణింపబడెను. అనవేమారెడ్డి స్వయముగా కస్తూరికాదిసుగంధద్రవ్యములు, కర్పూరపు ముక్కలు చూడవచ్చినవారిమీద వెదచల్లుచు

'వసంతరాయు'డను బిరుదును సార్థకపరచుకొనెను. (అనవేముని నడుపూరు శాసనము చూడుడు.)

43. పరిగృహీత నూతన మదనావతార: తీసికొనుటలో క్రొత్త మన్మథునివంటివాడు. అంటే రూపురేఖలు గలిగి చక్కని, అందమైన ఆకారము గలవాడు. అనవేమారెడ్డికి బిరుదు అన్వయించునని తలంచవచ్చును.

44. విరచిత బ్రహ్మాండదాన కనకధారాదాన గోసహస్రదాన కల్పతరుదాన: ఈ బిరుదువలన రెడ్డిరాజులు పరమధార్మికులని వెల్లడియగును. ప్రోలయ వేమారెడ్డి హేమాద్రి చింతామణిలోని దాన ఖండములో చెప్పబడిన దానములన్నియు...తు. చా. తప్పకుండజేసి విశేషయశస్సును సంపాదించెను. ఆయన తర్వాతివారు గూడ విడువకుండ అనేకదానములుజేసి కీర్తి గాంచిరి.

45. సంతత నిర్వర్తిత సప్తసంతాన: 13, 14 శతాబ్దములలో కీర్తి నార్జించుటకు 'సప్త సంతానములు నిల్పుట' ఉత్తమమార్గముగా పరిగణింపబడెను. ఆ కాలపురాజులు, మహారాజులు, వారి ప్రగ్గడలు యీ ఏడు పుణ్యకార్యములు తప్పకుండ చేయుచుండెడివారు. ప్రోలయవేమారెడ్డికి 'హరివంశము' నంకితమిచ్చిన ఎఱ్ఱాప్రగడ తన కృతిపతి నిర్వహించిన సప్త సంతానముల నిట్లు వివరించెను. (1) అగ్రహారములు బ్రాహ్మణులకు దానముజేయుట (2) చెరువులు త్రవ్వించుట (3) గుళ్ళు ప్రతిష్ఠించుట (4) నిధులు నిల్పుట (5) తోటలు, సత్రములు, చలిపందిళ్లు నిర్మించుట. (6) నల్లిండ్లు నిల్పుట. (7) కావ్యములను కృతిబొందుట. ధార్మికులైనవారీ పుణ్యకార్యము లీలోకములో తమ కీర్తిని చాటు సాధనములని దలంచుటవలన వీటిని నిర్వహించుటలో ఎక్కువశ్రద్ధ జూపెడువారు.

46 సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠాపిత కీర్తిస్తంభ: 'ప్రాచీసకాలములో ప్రాక్సముద్ర తీరము నంటియున్న కొండల నన్నిటికి వింధ్యపర్వత పాదములని ప్రసిద్ధిగలదు.' సింహాచలము నేటి విశాఖపట్టణపుదాపులోని పుణ్యక్షేత్రము. అచ్చట నెలకొనియున్న స్వామి వరహాప్పల నృసింహస్వామి. అనవేమారెడ్డి తన పూర్వదిగ్విజయయాత్ర ముగిసినతర్వాత సింహాచలము మొదలైన పుణ్యక్షేత్రములలో కీర్తిస్తంభములను స్థాపించెనని యీ బిరుదు సూచించును.

47. విజయరమా ప (రి) రంభ: విజయమను లక్ష్మిచే కౌగలింపబడినవాడు. అంటే ఎల్లప్పుడు యుద్ధములలో గెలుపేగాని ఓటమి ఎరుగనివాడు. ఈ బిరుదు అనవేమారెడ్డి నిర్వహించిన యుద్ధములు, సంపాదించిన విజయములను సూచించును.

48. సంగర గౌతమీ సలిల (సంగమ) సకల జలదుర్గ సాధన రఘురామ: ఈ బిరుదుగూడ అనవేమారెడ్డి విజయపరంపరలు సూచించును. రాజమహేంద్రవరమునకు రెండు క్రోసుల మేరలో గోదావరినది సముద్రములో కలియుప్రాంతములో ఏర్పడిన ప్రధానశాఖలమధ్యన ఏర్పడిన జలదుర్గములను అనవేమారెడ్డి తాను స్వాధీనపరుచుకొనినట్లు యీ బిరుదు తెల్పును. శాసనములలో ఆ ప్రాంతమును నాల్గు సీమలుగా చెప్పబడెను. (1) పానారుసీమ (2) కోనసీమ (3) కురువాటిసీమ (4) చెంగర సీమ. వీటిలో కోనసీమ జలదుర్గము. దీనిని రెండేర్ల నడిమి విషయమనిగూడ నందురు. అనవేమారెడ్డి కాలములో ఆ ప్రాంతము కొప్పుల వంశమునకుజెందిన ముమ్మడి నాయకుని స్వాధీనమందుండెను. అనవేమారెడ్డి ముమ్మడి నాయకు నోడించి ఆ ప్రాంతమును సాధించెను.

49. రాజమహేంద్ర నిరవద్యనగరాది బహువిధ స్థల దుర్గవర్గ విదళన బలరామ: అనవేమారెడ్డి రాజమహేంద్రవరము, నిరవద్యపురము (నిడుదవోలు) మొదలైన స్థలదుర్గములను గెల్చుకొనుటలో బలరామునంత పరాక్రమము జూపినవాడని యీ బిరుదు సూచన. వశిష్ఠ, గౌతమీనదిశాఖలకు పశ్చిమభాగమును పానారసీమ యందురు. అది స్థలదుర్గము. 46, 48, 49 సంఖ్యలలో చెప్పబడిన బిరుదులను బట్టి అనవేమారెడ్డి తన పూర్వదండయాత్రలో రాజమహేంద్రవరమునకు చుట్టుప్రక్కలనున్న జలదుర్గములు, గిరిదుర్గములు, స్థలదుర్గములు, వనదుర్గములు గల్గినటువంటి సీమల నన్నిటిని గెల్చుకొనెనని స్పష్టము.

48. సంగ్రామ సత్ర సంతర్పిత భూత వేతాళ: యుద్ధములను సత్రములలో భూతములను సంతర్పణ గావించిన బేతాళుడని దీని యర్థము. అంటే యుద్ధములో విరోధులను విరివిగా సంహరించినవాడను భావము. ఇది అనవేమారెడ్డికి సంబంధించిన బిరుదు.

51. కలియుగభేతాళ: కలియుగమునకు భేతాళ నంతటివాడు

52. పరిచితానేక గతి విశేష వారణ మారణోపాయ: అనవేమారెడ్డి నిర్వహించిన యుద్ధములలో నిర్వక్రపరాక్రమముతో దిగ్విజయములు గాంచుటలోని మర్మ మాబిరుదు తెల్పుచున్నది. ఆ కాలపు యుద్ధ విభాగములలో 'గజదళ' విభాగము చాల ముఖ్యమైనది. ఈ గజయుద్ధ తంత్రములో ఏనుగులగతి విశేషములచేత వాటిని వధించుఉపాయము తెలిసిన వాడు. గనుకనే విరోధి బలములను సులభముగ ఓడించుట కెక్కువప్రజ్ఞగలవాడని యీ బిరుదు సూచించును.

53. క్షురికాసహాయ: ఎల్లప్పుడు కత్తి సహాయముతో యుద్ధములలో అనన్యసామాన్య ధైర్యములుజూపి వీరాన్నపోతయని పేరు నందినవాడు. ఈబిరుదు అనవోతారెడ్డికి ముఖ్యముగ వర్తించును అతనిని 'వీరాన్నపోత' యని చెప్పుదురు.

54. విశ్వజన హిత పవిత్రచారిత్ర; ఈలోక జనులకు (అంటే తన రాజ్యములోని ప్రజకు) హితమగు పవిత్రచరిత్రగలవాడని యీ బిరుదు సూచించును.

55. వెల్లిచెరిగోత్ర: దీనివలన రెడ్డిరాజులు వెల్లిచెరిగోత్రమునకు జెందిన చతుర్థ కులజులని మనము గ్రహింపవచ్చును

56. ఉత్తుంగ చతుర గచ (రిపు) బలవైరి సేనాసాధక: ప్రత్యర్థుల సైన్యమెంత బలవంతమైనదైనను రిపుబలమును చెదరగొట్టి విజయములను సాధించుటలో నేర్పు చూపువాడు. అనవేమారెడ్డి ఎంత యుద్ధవీరుడో యీ బిరుదు తెల్పును.

57. శ్రీపర్వతాత శిరోమణి శ్రీ కుమారగిరి శ్రీమత్త్రిపురాంతకదేవ దివ్య శ్రీపాద పద్మారాధక: ఈ బిరుదు రెడ్డిరాజుల మతాభిమానమును దెల్పును. వీరందరు అఖండశివభక్తులు, ఈశ్వరార్చన కళాశీలురు. పర్వతనాథుడు, అహోబలస్వామి వీరికి సమానులే. ప్రోలయవేమారెడ్డి రెండు పుణ్యక్షేత్రములలో భక్తుల కుపయోగమునకై నిర్మించిన సోపానములే యిందుకు ప్రబలసాక్ష్యము.

58. వేమ భూపాల వంశాంబుధి సంపూర్ణ చంద్ర: వేమ భూపాలుడను సముద్రమునకు చంద్రునివంటివాడు అనవేమారెడ్డిఅని దీని భావన.

మొత్తమువిూద యీ బిరుదుల సవిూక్షవలన, రెడ్డిరాజులు మహాయోధులు, శూరులునయి మధ్యాంధ్ర దేశమును ప్రజారంజకముగ పరిపాలన మొనర్చిరనుటయేగాక వీరు పరమేశ్వరపాదారవిందభక్తితత్పరులనియు పరమధార్మికులనియు ధర్మోత్తరముగ రాజ్యమును పాలించి ఆంధ్రులహృదయములలో చెంగనికీర్తి ముద్రలనుంచిరని తెల్పుటకెంతయో ముదావహము. కాకతీయసామ్రాజ్య పతనానంతరము యవనుల దాడులతోను, అత్యాచారములతోను, మంటకలసిపోయిన హిందూ (వేద) సంస్కృతిని సర్వవిధముల పునరుద్ధరించిన రెడ్డిరాజుల కాలము ఆంధ్రుల చరిత్రలో సువర్ణ పుటలుగా ఎల్లకాలము నిల్చియుండునని మనముతలంచుట న్యాయము. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ History of the Reddy Kingdoms అను పుస్తకములో నిర్ణయించిన కొండవీటిరెడ్డిరాజుల పాలనా కాలపరిమితి యీ క్రింది విధముగా నుండెను.

1. ప్రోలయ వేమారెడి పాలన శక 1247–1275
2. అనవోతారెడ్డి ,, శక 1275–1286
3. అనవేమారెడ్డి ,, ,, 1286–1308
4. కొమరగిరిరెడ్డి ,, ,, 1308–1324
5. పెదకోమటి వేమారెడ్డి ,, 1324–1342
6 రాచవేమారెడ్డి ,, ,, 1342–1346

ఈ వ్యాసమును వ్రాయుటకు శ్రీ సోమశేఖరశర్మగారి History of the Reddy Kingdoms, ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారి రెడ్డిసంచిక, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి శ్రీనాథ కవితా సమీక్ష – ద్వితీయ సంపుటము–రెడ్డిరాజుల చరిత్ర ఎంతయో తోడ్పడ్డవి. ఆ గ్రంథ కర్తలకు నా కృతజ్ఞత.

# భిక్షువు

## శ్రీ త్రిపురాన వేంకటకృష్ణరావు

వెన్నముద్దయుంబలెఁ దోఁచె వేగుఁజుక్క
తరలి ప్రత్యూష పవనముల్ తట్టిలేపె,
గూళ్ళఁగేరింతలాడె శకుంత తతులు,
తల్లియొడి నూసులాడిరి పిల్లలెల్ల.

నిర్మలమనస్వియై లేచి, నిసుఁగు లలరి
తన్ను నలరింప స్నాతుఁడై, తలఁచి ప్రభుని;
బట్టె జోలియు, పడఁతిమున్ పెట్టి పసుప,
వెడలెఁ దడఁబడ నడుగులు, భిక్షువొకడు.

వీథివీథియుం ద్రిమ్మరి విసుగుపడక
పెట్టినను, బెట్టకున్న, దీవించి చనియె,
నిండె జోలియు; యొక సంచనుండిపోవఁ
గురిసెజడి, యెట్లొ యోర్చుకొనియె నతఁడు.

తాళమున్వేసి, పిల్లలుం దల్లి చనిరి
వేఱె కోనేటి కా వాన వెలిసినంత;
జోగి యటునుండ భిక్షకుల్ రాఁగడంగి
రటకు నావాన భిక్ష లభ్యంబుగాక.

జనని తనయులు వచ్చునంతన సమస్త
తండులములు భిక్షకుల కాతండు వెట్టె;
నింక బడుగగు నొక గ్రుడ్డి వృద్ధు రాఁగ
నింకఁ గలవేమి! యని పరీక్షించె జోలె.

దులుపఁ బసిఁడిగింజలు కొన్ని దొరికె సంచిఁ,
దడయు కుప్పంగి, యతని ప్రాప్తంబటంచుఁ
దల్లి పిల్లలుం జూడఁ, దాతకును మ్రొక్కి
పనిచె నాతండు కొంగున భద్రపఱచి.

---

# 'కోలెన్' శబ్ద విచారం

## శ్రీ చేకూరి రామారావు

భారతి డిసెంబరు, 1968 సంచికలో కొన్ని ప్రయోగవిశేషాల్ని గురించి చర్చిస్తూ, శ్రీ రేవూరు అనంతపద్మనాభరావుగారు చేసిన 'కోలెన్' శబ్దవిచారం నన్నాకర్షించింది. ఈ సందర్భంలో 'కోలెన్' గురించి నేను గమనించిన కొన్ని విశేషాల్ని పండితులకు నివేదించుకొనే ఉద్దేశంతో ఈ నాలుగు ముక్కలూ రాస్తున్నాను.

పైన పేర్కొన్న వ్యాసంలో పద్మనాభరావుగారు 'గోలె' అని శబ్దరూపమియ్యటం పొరపాటు అనుకుంటాము నేను చూసిన శబ్దరత్నాకర ప్రతుల్లో గాని, సూర్యరాయాంధ్ర నిఘంటువులోగాని, బ్రౌణ్యంలో గాని ఈ శబ్దం 'కోలె' అనే రూపంతోనే ఉంది. 'గోలె' అనే శబ్దరూపం గ్రహించటంలో ఉన్న ఇబ్బందుల్ని పెద్దవొక్కి చెప్పాల్సిన అవసరంకూడా లేదు. ఈ శబ్దానికి పూర్వంలోఉన్న నామానికి బిందువు రావాలంటే శబ్దరూపం పరుషాది కాక తప్పదు.

ఇక 'కోలెన్' శబ్ద ప్రయోగాల్ని గురించి శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు సంపాదక బాధ్యత నిర్వహించిన నన్నయపదప్రయోగకోశం ప్రకారం ఈ శబ్దాన్ని నన్నయ 16 సార్లు ప్రయోగించినట్లు గ్రహించగలం. వాటి వివరాలివి :

| | | |
|---|---|---|
| నాడు శబ్దంమీద (నాటన్) | — | 10 |
| అప్పుడు శబ్దంమీద (అప్పటన్) | — | 1 |
| నిన్న శబ్దంమీద | — | 1 |
| ఆది శబ్దంమీద | — | 1 |
| 'మొదలింట' శబ్దంమీద | — | 1 |
| మూణేండ్ల శబ్దంమీద | — | 1 |
| 'యోజనంబు' శబ్దంమీద | — | 1 |
| మొత్తం | — | 16 |

ఈ పట్టికనుబట్టి 'కోలెన్' శబ్దం నన్నయ ఎక్కువగా కాలబోధకశబ్దాలమీద ప్రయోగించినట్లు తెలుస్తున్నది. అందులోనూ మూడింట రెండు వంతులు నాడు శబ్దంమీదనే. 'ఆది', 'మొదలింట' (? మొదలిల్లు) శబ్దాల్నికూడా కాలబోధకశబ్దాలుగానే ఇక్కడ గ్రహిస్తున్నాను. ప్రాచీన వ్యాకరణ పరిభాష ననుసరించి ఈ శబ్దం ('కోలెన్') సప్తమ్యంతాలైన కాలార్థ్య పదాలమీదనే నన్నయ ప్రయోగించాడని సూత్రీకరించవచ్చు.

నన్నయభాషలో కూడా ఈ 'కోలెన్' శబ్దానికి అర్థనిర్ణయంలో కొన్నిచిక్కులున్నై. అధ్వబోధక శబ్దంమీద ప్రయోగించిన 'కోలెన్'కు కాలబోధక శబ్దాలమీద ప్రయోగించిన 'కోలెన్'కూ కనీసం ఆభాసమాత్రంగానైనా భేదం ఉంది. అధ్వబోధక శబ్దంమీద 'కోలెన్' శబ్దానికి నన్నయ ప్రయోగం ఇది :

'...దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడునట్లుగాఁ బ్రసాదించిన...'

ఆది–3 : 41.

పై ప్రయోగంలో నిఘంటువులిచ్చిన 'మొదలుకొని' ఆధునిక భాషలో ప్రయోగించే 'నుంచి' కాని అర్థాలుగా సరిపడటంలేదు 'వరకు' అనే అర్థంచెప్తే సరిపోతుంది. కాని 15 చోట్ల ఒక అర్థంలోను, ఒక్కచోట భిన్నమైన అర్థంలోనూ నన్నయ ప్రయోగించాడనటం అంత సమంజసంగా తోచదు. కాలబోధకశబ్దాలమీద 'కోలెన్' శబ్దానికి 'మొదలుకొని' సరిపోతుంది. కాని ఇక్కడ 'యోజనము మొదలుకొని' అని అర్థంచెప్పటం అతిక్లిష్టమైన మార్గంలో ఆలోచిస్తే తప్ప కుదరదు.

'నూతేండ్లంగోలె' ప్రయోగాన్ని గమనిస్తే దీనికి ఒకమార్గం కనిపించవచ్చు. ఈపై ప్రయోగంలో 'మొదలుకొని' మాత్రమేకాక నూరేండ్ల పర్యంతం అనే అర్థం ఇమిడిఉంది. ఆధునికభాషలో 'నుంచి'కి అట్లాంటి అర్థమే ఉంది విశేషమల్లా నన్నయ్యభాషలో ఈ అర్థంలో కాలాధ్వ శబ్దాలు రెండిటిమీదా ఒకేశబ్దాన్ని ప్రయోగించటం. ఇప్పుడు కోలెన్ శబ్దానికి 'From the point of origin in time or space and to the extent expressed in the preceding noun' అని అర్థం చెప్పవచ్చు. ఇది నన్నయభాషకు సరిపోతుంది.

నన్నయ్య తరవాతకవుల్లో 'కోలెన్' శబ్దానికి అధ్వవాచకాలమీద ప్రయోగాలు కనిపించలేదు కాలబోధకనామాల తరవాత విరివిగా కనిపిస్తున్నై. కాని తరవాతికవులు నన్నయ నియమాల్ని సడలించినట్లు కనిపిస్తున్నది.

ఈకింది తిక్కన ప్రయోగాల్ని గమనించండి.

1. పుట్టినకోలెను–(విరాట – 1:74)

2 గోగ్రహణంబునంగోలె (ఉద్యోగ–3– 92)

తిక్కన ప్రయోగాల్లో మొదటి దాంట్లో 'కోలెన్' శబ్దం క్రియాజన్యవిశేషణంమీద ఉంది. 'పుట్టినం గోలెను' అని అనంతపద్మనాభరావుగారు ఇయ్యటం ప్రమాదం లేకపోతే క్రియాజన్య విశేషణానికి సప్తమి ఎక్కడినుంచి వస్తుంది? నన్నయేతర కవుల భాషలోకూడా ఈ శబ్దం సప్తమ్యంతాల మీదనే రావాలనుకోవటంవల్ల ఈ ప్రమాదం ఆపతితమైందనుకుంటాను. ఇకపోతే పుట్టిన కోలెను అనే ప్రయోగాన్ని సమర్థించటం ఎట్లా? కోలెన్‌కు ముందున్న క్రియాజన్య విశేషణం భూతకాలార్థకం కావటం ఇక్కడ గమనించాల్సిన విశేషం. నన్నెచోడుని కుమారసంభవంలో కూడా క్రియాజన్య విశేషణంమీద 'కోలెన్' వేసిన రెండు చోట్లా కూడా అవి భూతకాలికాలే. (చూ. అబ్బూరి రామకృష్ణారావు, దివాకర్ల వేంకటావధాని (1965)—నన్నెచోడ - పదప్రయోగ సూచిక)

'ఎఱింగినకోలె' 'నిన్‌జూచినకోలె' (కుమార–3: 102) అని నన్నెచోడుడి ప్రయోగాలు. ఈపై భూతకాలరూపాల్లో 'ఇన' అనేది భూతకాలబోధకం. ఇక్కడకూడ నన్నయగారి 'కోలెన్'కు చెప్పిన అర్థమే సరిపోతుందిగాని నామాలమీదనేకాక క్రియాజన్యవిశేషణాలమీదకూడా 'కోలెన్' శబ్దం రావచ్చునని చెప్పకోవాలి. నన్నయభాషలో ఆ రకంగా రావటానికి వీల్లేదని చెప్పటానికి ప్రయోగం ఆధారం.

'...నినుజూచినయప్పటంగోలెను...'

(ఆది –6: 193)

తిక్కనగారు ప్రయోగించిన 'గోగ్రహణంబునంగోలె' అనేచోట 'గ్రహణం' కాలబోధకనామంకాదు. కాలబోధకనామం తర్వాతే 'కోలెన్' శబ్దాన్ని ప్రయోగించాలనే నన్నయ్యగారి నియమాన్ని తరవాత కవులు సడలించారన్నమాట. నామాలు వాక్యంలో ప్రవర్తించే పద్ధతినిబట్టి బహుధా విభక్తాలనీ, అందులో వ్యాపారార్థక నామాలనేవి ఒకతెగ అనీ నా 'నామ్నీకరణాల' వ్యాసాల్లో ఆధునికభాషలో వాక్య నిర్మాణాన్ని పరిశీలిస్తూ సూచించాను. (చూ. చేకూరి రామారావు; వ్యాపారార్థక నామ్నీకరణం–భారతి, జనవరి 1969). 'గ్రహణంబు' అనే నామాన్నిక్కడ వ్యాపారార్థకనామంగా గ్రహించాలి. వ్యాపారం కాలంలో జరుగుతుంది కాబట్టి వ్యాపారార్థక నామాల్లో కాలబోధకత ఇమిడిఉందని తిక్కనగారి వ్యాకరణం అయిఉండాలి. పై తిక్కన ప్రయోగానికీ నియమాన్నంగీకరించినతరవాత 'గోగ్రహణం జరిగినప్పట్నుంచి' అని ఆధునికభాషలో అర్థం చెప్పకోటానికడ్డు ఏమీలేదు. తిక్కన పదప్రయోగ సూచిక అచ్చు పూర్తిఅయితే తిక్కనగారి వ్యాకరణంలో కొత్తవిశేషాలు బయటపడవచ్చు. అందాక పై సూత్రీకరణ వర్తిస్తుంది. ఇక నన్నెచోడుని కుమారసంభవంలో మన్ని ఇబ్బంది పెట్టే ప్రయోగం ఒకటి ఉంది. అది ఇది.

కను చూడ్కింగోలెను దం
డ నమస్కారములుసేసి డాయంజని స
న్మునితతి గరముకుళితులై
వినుతించుచు నిలిచి రఖిలవేదస్తుతులన్.

(కుమార–7 : 80)

ఇక్కడ 'చూడ్కి' అనే నామం కాలబోధకం కాదు. దీనికి అర్థం చెప్పాలంటే 'చూడటం జరిగినప్పట్నుంచీ' అంటే 'చూసినప్పట్నుంచీ' అని అర్థం చెప్పాలి. అయితే 'చూడ్కి' అనే నామం ఎట్లాంటిది? నన్నెచోడుడు దీన్ని వ్యాపారార్థకనామంగా ప్రయోగించాడనటంకంటె ప్రస్తుతానికి గత్యంతరంలేదు. 'చూడ్కి'కి సమానార్థకమైన 'చూపు' ఆధునిక భాషలో వ్యాపారార్థకనామం కాదు. చూడ్కిని వ్యాపారార్థకనామం అనటానికి ఇంతకన్నా వేరే ప్రయోగం దొరకలేదు. అందువల్ల ప్రస్తుతానికిది ఒక ప్రతిపాదన మాత్రమే. ఇంతకన్నా మంచి మార్గం దొరికే వరకూ దీన్ని అంగీకరించవచ్చు.

ఈ 'కోలెన్' శబ్దం 'కోలె' అనే రూపంతో వసుచరిత్రలోనూ, 'కోల్' అనే రూపంతో యయాతి చరిత్రలోనూ వాడినట్లు సూర్యరాయాంధ్ర నిఘంటువిచ్చిన ప్రయోగాల్నిబట్టి తెలుస్తున్నదిగాని రూపభేదంతప్ప అక్కడ గమనించదగిన వ్యాకరణ విశేషాలేం లేవు. కాని ప్రౌఢ్యంలో, Through, by reason of అనే అర్థాన్నొకటిచ్చి 'అతని గోలె' అనే ప్రయోగం 'తారాశశాంక విజయము' (5:22) లోదిగా పేర్కొనబడింది. దానికి by reason of him అనే అర్థంకూడా సూచించబడింది. శేషము వెంకటపతి రాసిన '(తారా)శశాంక విజయము'లో ఆ ప్రయోగం నాకు కనపడలేదు. ఇంకెవరిదైనా వేరే తారాశశాంకవిజయం ఉందేమో నాకు తెలియదు. పై ప్రయోగమే గనక సరైనదైతే అక్కడ ఏం జరిగిందో తెలుసుకోటం కష్టం కాదు. ఈ ప్రయోక్త ఆధునిక భాషలో (అంటే తనకాలపు భాషలోకూడా ఉండి ఉండాలి) ప్రయోగించే 'నుంచి' శబ్దానికున్న 'వల్ల' అనే అర్థాన్ని 'కోలెన్' శబ్దానికికూడా తగిలించాడన్నమాట.

ఈ కోలెన్ శబ్దాన్ని గురించి పూర్వం కొందరు విద్వాంసులు చర్చించారు. అందులో వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారు (1952 : 802, 1015) సూచించిన ప్రక్రియ గమనించదగింది. 'పుట్టిన కోలెను'అనే ఒక్కన ప్రయోగాన్ని 'పుట్టిన+అది+కోలెన్' (802) అని ఒక చోట 'పుట్టిన దానం గోలెన్' (1015) అని వేరొక చోట ప్రక్రియాగతి సూచించారు. అంటే 'పుట్టిన+అది+కోలెన్'అనేదిఆధునికభాషాశాస్త్ర పద్ధతిలోచెప్పేవ్యాకరణ మూలరూపం (underlying form) గా గ్రహించి తచ్ఛబ్దానికి లోపం చెప్పటంవల్ల 'పుట్టినకోలెను' అనే రూపాన్ని సాధించవచ్చునని శాస్త్రిగారి ఊహ. అంటే మూలనిర్మాణం (underlying structure) లో 'కోలెన్' నామంమీదనే ప్రయుక్తమని చూపించటం శాస్త్రిగారి ఉద్దేశం. మూలరూపాలు కూడా ప్రయోగార్హాలేనని శాస్త్రిగారు ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది. అట్లాకాకపోతే అది శబ్దాన్ని 'దానన్'గా మార్చాల్సిన అవసరంలేదు. సప్తమిని చేర్చకుండానే లోపం చెప్పొచ్చు.శాస్త్రిగారు చూపించిన మూలరూపాలు ప్రాచీనభాషలో ప్రయోగార్హాలు అనటానికి ఆధారాల్లేవు. ఈ పద్ధతిలో ప్రక్రియాసౌలభ్యంకూడా కనిపించదు. క్రియాజన్య విశేషణంమీద తచ్ఛబ్దానికి మరే విభక్తిప్రత్యయంముందు లోపంవచ్చినట్లు కనపడదు. అందువల్ల తచ్ఛబ్దలోపసూత్రం పరిమిత ప్రయోజనాన్ని మాత్రమే సాధిస్తుంది.

దివాకర్ల వేంకటావధానిగారు (1960 : 835) తమ 'నన్నయ భారతము' అనే గ్రంథంలో ఈ 'కోలెన్' శబ్దాన్ని గురించి చర్చించారు. 'ఇది 'కొల్, కోల్' అను ద్రావిడ ధాతువునుండి పుట్టినది. కొలచు; (to measure) అను తెలుగు ధాతు విందుండి పుట్టినదే. దీనినుండి 'కొల' అను విశేష్య రూపము కలిగినది. కన్నడమున నిది కోలె అను రూపముతో నుండును. ఇదే క్రమముగా కోలె అను విభక్తి ప్రత్యయముగా మారి ద్రుతాంతమైనది. ఇది సప్తమ్యంతములగు కాలార్థ్య వాచక పదములపై జేరుచుండును' అని కోలెన్ శబ్ద వ్యుత్పత్తిని సూచించారు. దాదాపు ఇదే అభిప్రాయాన్ని నన్నెచోడుని గురించి రాస్తూ (1965:70) వెలిబుచ్చారు.

'Kole derived from the Dravidian roots Kol, Kōl has gradually become a case termination. Nannaya uses this after words denoting time and ending in locative case suffix. Nannechoda uses this not only after denoting time but

also after verbal adjectives and nouns in the accusative case.'

నన్నెచోడుడు కోలెన్ శబ్దాన్ని క్రియాజన్య విశేషణాలమీద ప్రయోగించిన పద్ధతిని ఇంతకుముందు గమనించాం. ద్వితీయావిభక్త్యంతంగా (Ending in the accusative case) వారు గ్రహించింది 'కనుచూడ్కిన్' అనే పదాన్నే అని తరవాత వారిచ్చిన ఉదాహరణవల్ల స్పష్టం. 'కనుచూడ్కిన్' అనే పదాన్ని సప్తమ్యంతంగా కాక ద్వితీయాంతంగా ఎందుకు గ్రహించాలో వారు కారణాలు చెప్పలేదు. ఇక 'కోలెన్' శబ్దవ్యుత్పత్తిని గురించి ఆలోచిద్దాం. కన్నడంలో మానార్థంలో 'కొలె' అనే రూపం నాకు కనిపించలేదు. ఇక కొలచు, కొలత అనే పదాలకు మూలరూపమైన ప్రాచీన ధాతువు భద్రిరాజు కృష్ణమూర్తి (1961–:338) ప్రకారం *కొళ్. సోదర భాషల్లో దీనికి సంబంధించిన పదాలివి

కన్నడం. కుళ: a certain measure; కొళగ: a measure of four ballas; కొళకె: a third crop of rice; తుళు కొళగ: a measure of grain; తమిళ–కుళక్కమ్: a standard grain measure; మలయాళ—కొళకమ్; గోండి. కోల్స్: to measure; కొలామి. కుల్ to count.

కొలచు, కొలత, కొల—వంటి పదాలకు మూలరూపమైన '*కొళ్' కూ, 'కోలె'కూ సంబంధం ఉన్నట్టు పై పదాల్నిబట్టి చెప్పలేం.

'కోలెన్' శబ్దానికి అర్థంలో సరూపమైన శబ్దం నాకు కన్నడంలో కనిపించలేదు. తమిళంలో నేను చూసిన Tamil lexicon (1927 లో 'కోలు' అనే ధాతువు to commence అనే అర్థంలో ఉంది దానినుంచి నిష్పన్నమైన 'కోలుమె' అనే నామం Commencement అనే అర్థంలో ఉంది. T.Burrow & M. B. Emeneau (1960) దీనికి మలయాళంలో 'కోలుక' అనే రూపం (DED 1858) ఇచ్చారు. కాని అర్థంలో మార్పు కనిపిస్తున్నది. బహుశా తమిళంలో ఈ కోలు ధాతువు తెలుగు 'కోలెన్' శబ్దానికి cognate కావచ్చు. తమిళంలో 'కోలు'కు 'కోలి–' అనే భూతకాలికరూపమున్నట్టు Burrow & Emeneau (1960) సూచించారు. ఇంకా ఇతర ద్రావిడ భాషల్లో సరూప పదాల్ని పరిశీలిస్తేనేగాని శాస్త్రీయ పద్ధతుల్లో మూలరూపాన్ని నిర్మించలేం. ఉన్న ఆధారాన్నిబట్టి *కోల్ to commence అనే మూలద్రావిడరూపాన్ని ప్రతిపాదించవచ్చుగాని, ఇతర ద్రావిడ భాషల్లో సరూపశబ్దాల్ని పరిశీలిస్తేనేగాని స్థాపించలేం. ఇప్పటికీ ఈ *కోల్ రూపమే మూలధాతువుగా నిలిస్తే *కోల్ నుంచి 'కోలెన్' రూపం ఎట్లా నిష్పన్నమైందో ధ్వని సూత్రంద్వారా శాస్త్రీయపద్ధతుల్లో నిరూపించాలి. అందాకా 'కోలెన్' శబ్ద వ్యుత్పత్తిని గురించి చేసే ఊహలు వట్టి ఊహలె.

## ముఖ్యగ్రంథ, వ్యాస సూచిక

1. A Dravidian Etymological Dictionary·Oxford. (1960) Burrow, T. Emeneau M. B.

2. ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము. వాల్తేరు (1952) చినసీతారామస్వామిశాస్త్రి, వఝల.

3. Telugu Verbal Bases' A Comparative and Descriptive Analysis. Berkely (1961) Krishnamurthy, Bh.

4. నన్నయ భారతము. హైదరాబాదు (1960) వేంకటావధాని, దివాకర్ల.

5. Case Terminations in Nannechoda's Kumara Sambhava; in Journal of Osmania University, Vol 3. Hyderabad (1965) Venkatavadhani D

6. నన్నయ పదప్రయోగ కోశము; హైదరాబాదు (1960) రామకృష్ణరావు, అబ్బూరి; వేంకటావధాని, దివాకర్ల.

7. నన్నెచోడ పదప్రయోగ సూచిక. హైదరాబాదు. (1965) రామకృష్ణరావు, అబ్బూరి; వేంకటావధాని, దివాకర్ల.

8. Tamil Lexicon. Madras (1927.)

# భావకవిత్వం - కరుణశ్రీ

శ్రీ గొల్లపూడి ప్రకాశరావు

హృదయోద్వేగం కల్గించే సందర్భాల్లో భావావేశంతో మానవుని హృదయంనుండి కవితా శిశువు ఆవిర్భవించింది. ఆంధ్రుల పాలిటి పెన్నిధియైన నన్నపార్యుడు గాలికీ ధూళికి తిరుగుతున్న ఈ బాలికను ఆదరించి పోషించాడు. భారతాభరణంతో అలంకరించాడు. నాటినుండి కవితా కన్యకు యధాశక్తి కవివరేణ్యులు ప్రేమభావంతో నూతనాలంకారాల్ని సమకూరుస్తూనే వున్నారు. ఆంగ్లేయులు భారతదేశం రావడంతో క్రొమ్మెరుంగులు జిమ్మే విదేశీ అలంకారాలను సైతం దిగుమతి చేయించారు. భావకవిత్వమూ, అభ్యుదయకవిత్వమూ మొదలైనవి ఆంధ్రసరస్వతిని శోభింపజేసిన నూతనాలంకారాలు.

భావమూ, భాషా అవినాభావ సంబంధం గలవి. భావపూరితంగాని కవిత్వంవుండడం అసంభవం మరి ఈ భావకవిత్వంమేమిటి ? ప్రాచీనుల భావాలువేరు. నవీనుల భావాలువేరు కాలం మారే కొద్దీ మానవుల మనస్తత్వాలు మారుతుంటాయి. స్త్రీ ప్రత్యంగాన్నీ విపులంగా వర్ణించే భావాలు ఆనాటి కవులకూ, పాఠకులకూ ఆనందాన్ని కల్గించేవి. బాహ్యసౌందర్యంపైగాక మానసికసౌందర్యంపై నేటి కవికుమారకుల దృష్టి. 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అని ప్రాచీనుల శాసనం. స్త్రీ సంతానానికి కారణమై వంశం నిలబెట్టే వస్తువు మాత్రమేనని వారి విశ్వాసం. 'ఆమె నవనీతహృదయ నా అంతరంగ శాంతిదేవత' యని భావించడం ఆధునికుల ఆనందం ప్రేయసీచరణచారణచక్రవర్తులం అని అనుకోవడంలో అంతులేని సంతృప్తి. ప్రణయభావాలలో ప్రత్యేకించి నూతనత్వాన్ని ప్రోదిచేసుకున్న కవిత్వమే భావకవిత్వం అని పిండితార్థం.

ఒక అర్థశతాబ్దంపాటు ఆంధ్రలోకాన్ని కదిలించి, కరిగించిన భావకవిత్వాన్ని గూర్చిన కవి పండితుల నిర్వచనాలను పరిశీలించడం అప్రస్తుతం కాదు 1 'కవియొక్క అవిస్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢతాపము ఒక చిన్నకావ్యములో ఊదబడినచో అది భావకవిత్వము' అని విశ్వనాధ సత్యనారాయణగారి నిర్వచనం. ఈ నిర్వచనం ఆంగ్లేయుల Lyric Poetry నిర్వచనంతో సరిపోలివుంది. 'The lyric has the function of revealing in terms of pure art, the secrets of the inner life, its fantastic joys, its sorrouus, its delireum'-(Ency. Brica) 'కవి హృదయంలో తటిత్తువలె అప్రయత్నంగా మెరసిపోయిన భావముల అక్షరాకృతియే భావకవిత్వమని శ్రీశ్రీ ఉద్దేశం.

కవి తన హృదయాన్ని కల్లోలపరచిన భావాలను 'మరుగులేకుండా వెర్రిగా వెల్లడించుకోవడం, ప్రకృతివర్ణనలకు బదులు సుకుమార సౌందర్యతత్వాన్ని నిర్దేశించడం, బాహ్యసౌందర్యానికి బదులుగా ఆత్మసౌందర్యాన్ని, సద్గుణసౌందర్యాన్ని వర్ణించడం, తనను కన్న నేలను తనహృదయాన్ని లోగొన్న నేలను గూర్చి స్వేచ్ఛాగానం చేయడం' భావకవుల్లో కన్పించే ప్రధానలక్షణాలు. ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభంనుండి ప్రారంభమైన భావకవిత్వోద్యమం అభ్యుదయ కవితారంభం వరకూ నిరాటంకంగా సాగింది. రాయప్రోలు, విశ్వనాథ, వేంకటపార్వతీశ్వరులు, కృష్ణశాస్త్రి, దువ్వూరి, బసవరాజు, జాషువా, కరుణశ్రీ, తుమ్మల, తల్లావజ్ఝల— అంతా ఒకరినిమించి మరొకరు భావకవితారథాన్నారోహించి ఆకాశపుదారుల్లో ఆనందంతో స్వేచ్ఛగా

1. ఆధునికాంధ్ర సాహిత్యము—సంప్రదాయములు; ప్రయోగములు — డా॥ సి నారాయణరెడ్డి.

పయనించారు. ప్రకృతినీ, ప్రణయమునూ, భక్తినీ దేశభక్తినీ వర్ణించి చెవులున్నవారికి వీనులవిందు గావించారు.

ఆధునికాంధ్రసాహిత్యంలో కరుణశ్రీ కాంతు లెగజిమ్ముతూ వెలిగే ధ్రువతార కోటానుకోట్ల నక్ష త్రాల్లో ధ్రువతారదొక ప్రత్యేకత అపారకావ్య సంసారంలో కరుణశ్రీ దొక ప్రత్యేకత. అనంతరం ఆంధ్రదేశంలో వెలసిన అనంత శ్రీకాంత నామ ధేయులు కరుణశ్రీ ప్రభావానికి ప్రత్యక్షోదాహరణాలు. కరుణశ్రీ కలకండరసాన్ని కలంలోనింపి కావ్యరచన గావించారు. కాకపోతే పండితసభలలో మాత్రమే నృత్యగానాలుచేసే సరససాహిత్యకన్యక అంజలిఘటించి 'కూర్చుండ మాయింట కుర్చీలు లేవ'ని ప్రణయాంకమునే సిద్ధపరతునను భక్తురాలికీ, 'అమ్మ నీచేతి తాంబూలం కమ్మదనము భరతదేశాన గుమగుమ పరిమళించె' అని పాడే చాపుకుర్రవానికీ, 'చూచెదవేలనో ప్రణయసుందరి' అని మరదలు పిల్లను సరసమాడే ఆటలు రాని ఆకతాయి బావ గారికీ గోచరించివుండదు. భక్తుని హృదయాన్నీ, గాజుంబత్తుని హృదయాన్నీ, కొమ్మలుతిరిగిన పండి తుల మనస్సులనూ, గిత్తలకొమ్ములకు రంగులు వేసే పామరుడైన పాలేరు హృదయాన్నీ సమానంగా రంజింపజేయగల కవిత్వము కరుణశ్రీ కవిత్వము. భావకవులతో చేయికలిపి జగమునిండ కవితాఝురులు నింపినకవి కరుణశ్రీ.

కరుణశ్రీ రచనల్లో సిరులు వెదజల్లుతూ ప్రకా శించే కావ్యత్రయము ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ. కరుణశ్రీ కరుణమూర్తి బుద్ధుని జీవితగాథ. విజయశ్రీ విజయుని యుద్ధోత్సాహగాథ. ఉదయశ్రీ ముత్యాలసరం. ఉదయశ్రీలోని కథాఖండికలనుగాక భావఖండికలను మాత్రమే పరామర్శించి కరుణశ్రీ భావకవితాశ్రీ ననుభవించడం ప్రస్తుతం. ఆధుని కాంధ్ర సాహిత్యంలోని సంప్రదాయాలనూ, ప్రయో గాలనూ వివరిస్తూ డాక్టరు సి. నారాయణరెడ్డి రచించిన గ్రంథంలో భావకవితావృక్షంలోని వివిధ శాఖలు వివరింపబడ్డాయి అందు ప్రణయకవిత్వము, ప్రకృతికవిత్వము, భక్తికవిత్వము, దేశభక్తికవిత్వము, సంఘసంస్కరణకవిత్వము, స్మృతిగీతాలు ప్రధాన శాఖలు ఈశాఖల్లో కరుణశ్రీ పండించిన భావఖండి కల ఫలాన్ని ఆరగిద్దాం.

## ప్రణయకవిత్వం

ప్రణయం అనేపదానికి స్నేహము, యాచన, ప్రీతి, అనక్తి, ప్రేమ అనే అర్థాలు అనేకం వున్నా భావకవిత్వంలో ప్రేయసీప్రియులకుగల పరస్పరాను రాగానికి సంకేతంగానే ఈ పదం వాడబడింది. ప్రేయసిని కేళిపవర్ధనగాగాక సహచారిణిగా, ఆరాధ్యదేవతగా భావించిన భావకవుల దృష్టిలో ప్రణయం సాధారణ కామానికి అతీతమైనది. కరుణశ్రీ సృష్టింతా ప్రేమమయమనే భావిస్తున్నాడు. ప్రేమభావమే మానవహృదయాల్లో శూన్యమయితే కాలచక్రం స్తంభించి పోతుందని కవి గాఢవిశ్వాసం కరుణశ్రీ కవితలో 'కరుణామయి, పారవశ్యము, అద్వైతమూర్తి' మొదలైన ఖండికలు రాధాకృష్ణుల పవిత్ర ప్రణ యాన్ని వర్ణించే రసగుళికలు సాంధ్యశ్రీ, వైశాఖి, ప్రాభాతి మన్నగు ఖండికలు ప్రణయబంధంతో బంధింపబడ్డ ప్రేయసీప్రియుల భావాల్ని విశదీక రించే కలకండపలుకులు. చదివినకొద్దీ చవులూరించే చెఱకుపానకం, రాధాకృష్ణుల ప్రణయ వర్ణనఘట్టం. ప్రభుప్రేమలో పేదరికాన్ని భరించలేని రాధ కృష్ణుని మోహనమురళీస్వరంవిని అద్దమరేయి, ఒంటిగ, రహస్యంగా యమునాతటం చేరింది. కరుణ చిందే చూపుల్తో స్వామి వేంచేస్తాడని శ్యామలశాద్వలీస్థలాలు పచ్చపట్టుపరుపులు పరచి పాదపూజకోసం ఎదురుచూస్తున్నాయి. వేణునాదం విన్పిస్తుంది దూరదూరంగా, మందమందంగా. స్వామి మాత్రం కన్పించడంలేదు. గుండెలు పుల్కరింపజేసే ఆ వేణునాదాన్నయినా కొసరికొసరి వినాలని రాధ తాపత్రయం. ఎంతకూ చెంతచేరని శ్రీకృష్ణుని తలుచుకుంటూ, విరహాగ్నిని ఓర్చుకోలేక కుమిలిపోతూ నిరపరాధిననీ, కరుణించమనీ రాధ చేసేప్రార్థన సహృదయుల మనస్సులకు ఆనందమూ, ఆవేదనా కల్గించేది.

'రాధనురా ప్రభూ! నిరపరాధనురా?
అనురాగభావనా

రాధన మగ్న మానసనురా !
కనరా ! కరుణింపరా ! మనో
వీథి పదేపదే కలక
వేయుచు నున్నవిరా పురారహో
గాథలు—ఈదలేనిక అగాధ
తమోమయ కాలవాహినిన్.

విషాద గీతికల నాలపిస్తూ అగాధతమోమయ కాలవాహిని నీదలేననుచున్న రాధకు శ్రీ కృష్ణ సందర్శనం కల్గడం 'పారవశ్యం' అనే ఖండికలో వర్ణింపబడింది. శరద్రాత్రి. ఆకాశంలో దేవతాస్త్రీలు తీర్చినదీపాల్లా మింటచుక్కలు వెలుగుతున్నాయి యమునానది పైనుండి పిల్లగాలి చల్లగా, మెల్లగా వీస్తున్నది చందురుడు చిచ్చువలె వెలుగుతున్నాడు. తప్పు కేతెంతునని మాటతప్పిన మోహనస్వరాల వానిపై పెచ్చు మీరుతున్న క్రోధము. ఇంతలో రాధిక వాల్గన్నుదోయిని కోమలహస్తాలు స్పృశించాయి. కస్తూరి సువాసనలు, తులసీదళపరిమళమ్ములు, వెన్నదొంగను పట్టిచ్చాయి—రాధ మనసులో అనురాగం, ఆనందం, ఆవేశంతో త్రోపులాడాయి. ఉద్వేగాన్ని అణచుకోలేక 'కృష్ణడో, కృష్ణడో' అంచు కేక వైచినది. ఇంతలో కోపము గుర్తు వచ్చినది. నిష్ఠురోక్తులాడినది. లలనామనశ్చౌర్యప్రవేత్తయైన కృష్ణుడు శిక్షించమని కోరినాడు. శిక్షలలోగూడ సౌకుమార్యాన్ని కోరేవాడు శ్రీ కృష్ణుడు.

'అలసించుట కాగ్రహ మందితేని
వెలది విరిదండ సంకెలల్ వేయరాదె
ముగుద పూబంతితో నన్ను మోదరాదొ
కలికి మొలనూలుతో నన్ను కట్టరాదొ.'

కాంక్ష తీదేర్చు శిక్షలను కోరినప్రభువు చమత్కారానికి రాధికకు నవ్వువచ్చింది. రాధిక నవ్వినదో లేదో ప్రకృతి పరవశించింది. రాధ తలలోని మల్లె పూవులుగూడ పొట్టలువిచ్చునట్లుగా — నవ్వినవి. వంతగించి మ్రొక్కించుకొన్న రాధ తన నిర్దయతకు తన్నుతానే నిందించుకొని శ్రీ కృష్ణుని యక్కున వ్రాలిపోయినది. 'నీవే నేనుగ, నేనే నీవుగ ఏకమై పోదా'మనే ముగ్ధమోహనప్రణయం రాధాకృష్ణుల ప్రణయం.

'సౌందర్యశ్రీ' యందలి ప్రియుడు ప్రేయసిని ప్రణయదేవిగా భావించాడు. హృదయదేవాలయంలో ఉన్నతపీఠంపై అధివసింపజేశాడు. కావుననే 'అభ్యంజన మాడి కురుల్ తడియార్చుచు గూరుచున్న ప్రేయసిని గాంచి జడఅల్లుదునా, అని ప్రణయగీతము లాలాపన చేస్తున్నాడు. వలపుపండిన పారవశ్యముతో ప్రియుడు చే రుమాలనై ప్రేయసిపెదవుల నొత్తెదనని కోరుచున్నాడు. ఎండవేడిమికి ప్రేయసి శరీరమున ఉద్భవించిన శ్రమాంబువులను పైపయి దుడువవలెనని ఆకాంక్షిస్తున్నాడు. కృశోదరియైన ప్రేయసి మోమును చూడనిక్షణము వ్యర్థమని మోమాటము ద్రిప్పబోకుమని ప్రార్థించుట పరాకోటికెక్కిన ప్రణయభావానికి తార్కాణం.

## 2. ప్రకృతివర్ణన :—

పూర్వకావ్యాలలో ప్రకృతి వర్ణనకుగల స్థానం గణనీయమైంది. అష్టాదశవర్ణనలతో పుర, నగ, వరణ, సముద్ర,చంద్రాది వర్ణన లన్నియు ప్రకృతి వర్ణనలే. ఈ ప్రకృతివర్ణన ప్రధానంగా నాయికా నాయకుల హృదయగతప్రేమభావాల ఉద్దీపనకు ఆలంబనంగా ఉపయోగించేవి. కానివో రాజాధిరాజుల పురములను, ఉద్యానవనాల్ని వర్ణించేవారి సౌభాగ్యాన్ని నిర్ణయించేవి. ఆధునికులు ప్రాచీనుల మార్గాన్నే అనుసరించినా వర్ణనావిధానంలో అంతరమున్నది. 'కాలభిషగ్వరుం డవిదతంబై కాముకశ్రేణికిన్ మారోత్సాహము నిత్యబాదరసమున్ బంధించి గ్రాసార్థమై క్షీరస్థాలిక బెట్టినట్టి గుళికా సిద్ధౌషధంబో' అని ప్రాచీన చంద్రవర్ణన.

'అది శరద్రాత్రి, గగన సౌధాంగణమున
దేహతాస్త్రీలు దీపాలు తీర్చినారు
సరస రాకాసుధాకర కరములందు
కలకలమటంచు నవ్వె శృంగార సరసి'

'పిండార బోసినట్లు పండువెన్నెల జగమెల్ల నిండిపోయె.' అధునాతన కవి శరద్రాత్రి వర్ణన. దృశ్యాన్ని వెన్వెంటనే సాక్షాత్కరింప జేయడమే గాకుండా ఈ వర్ణన కథాగతితో పెనవేసుకొని పోను నట్టిది.

ఉషస్సు, ప్రాభాతి, సాంధ్యశ్రీ, వైశాఖి మున్నగు ఖండికలు ప్రకృతిని రమణీయంగా వర్ణించే గీతికలు. ఉషఃకాలవర్ణనలో దాస్యాంధకారమున అలమటించి పోతున్న ప్రాచీబాలకపోలపాళికలపై సౌవర్ణరేఖాచిత్రములు ఎవరు గీతురనీ, ప్రాభాత శోభావళుల్ వెలయునా అని భారతీయులస్వాతంత్ర్య కాంక్షను వ్యంగ్యంగా వెల్లడిస్తున్నాడు. వైశాఖ మాసపు వేడిగాల్పులకు కుండలపై గుంపులు గూడిన పిచ్చుకలను, చెట్టుకొమ్మలపై వడబడి కూర్చున్న పిట్టలను, తలవంచి వాడిపోతున్న లేతగులాబిని వర్ణిస్తూ ప్రేయసీప్రియుల సంభాషణలను ప్రవేశ పెట్టారు. ప్రాభాతిలో వర్ణన నిద్రిస్తున్న ప్రేయసిని ప్రమోదంతో మాతృపూజకు వెళ్ళడానికి ప్రియుడు నిద్రలేపే సందర్భంలోనిది

ప్రకృతి మానవుల సుఖదుఃఖాలలో పాలు పంచుకుంటున్నట్లు వర్ణించడం నూతనంకాకపోయినా కరుణశ్రీ ఆ వర్ణనలకు నూతనత్వాన్నీ, ప్రత్యేకతనీ చేకూర్చారు. కృష్ణభగవానుడు వేంచేయనున్నాడని శాద్వలీ స్థలాలు పచ్చపట్టుపరుపులను పరవడం, రాధికాక్రోధమధురాధర మొక్కింత నవ్వగానే కల కలమటంచు ప్రకృతి నవ్వడం, పూదోటలో ప్రభు పూజకు పూలు దొరకని బీదభక్తుణ్ణిచూచి ప్రసవ బంధాలు సడల బాష్పబిందువులు రాల్చడం అమూల్యో దాహరణాలు.

## 3. భక్తి కవిత్వం

భక్తునికి భగవంతునిపైగల అనిర్వాచ్య ప్రేమ భావమే భక్తిభావము. ఈ ప్రేమయే మానవులమధ్య కేవలప్రణయంగా భాసిస్తుంది. కరుణశ్రీ ఉదయశ్రీ కావ్యము భగవంతుని చిద్విలాసానికి ఆనందించిన భక్తుడు కృతజ్ఞతాభారంతో అంజలించుటతో ఆరంభమైనది. సృష్టికార్యము భగవంతుని విలాసము. విచిత్రమైన దీ సృష్టి. మానవుని మొదలు సానువుల వరకూ ఒక్కొక్క ప్రత్యేకత. గిజిగాని గూటి సొగసు, నీలాకాశవేదిలో చుక్కల ముగ్గుల అందచందాలు, పూలకంచాలలో భృంగాలకు సిద్ధపరచిన భోజనం— ఇవన్నీ భగవంతుని లీలలకు చిహ్నాలు. అది మధ్యాంత రహితుడగు పరమాత్మునకు మాత్రమే సాధ్యమయ్యే కార్యాలివి. అందచందాల కాటపట్టైన ఈ ప్రకృతిని సృజించి పోషిస్తున్న భగవంతుని కవి కరుణశ్రీ కమనీయ గీతాలతో పూజిస్తున్నాడు. హృదయ నారికేళాన్ని సమర్పిస్తున్నారు ప్రణయాంకాన్ని సిద్ధపరుస్తున్నారు. అలసటయే యెరుగని అనంతశక్తి సంపన్నుని అలసిపోయాడని సేదదీర్చ ప్రయత్నిస్తున్నారు. సర్వాంతర్యామియైన ప్రభువును తన కుటీరం తలుపు తెరిచి ఆహ్వానిస్తున్నారు. భక్తుని ముగ్ధ భక్తికి 'అంజలి'లోని పద్యాలు అప్రతిమానాలైన ఉదాహరణలు. భక్తులపాలిట కొంగుబంగారమై, గోరంతపూజనే కొండంతగా భావించి సంతృప్తిచెంది కోర్కెల నీడేర్చే గణపతిని పూజించమని సోదరీ సోదరులను ప్రోత్సహిస్తున్నారు

భగవంతునకు ఆనందాన్ని కలిగించేది మధుర హృదయం: కోరేది భక్తి. ప్రతిఫలంగా ఇచ్చేది ముక్తి. బంగారు సెజ్జలలో తెచ్చిన స్వార్థపరుని రమణీయ పుష్ప సమర్చనాన్ని పరమాత్ముడు స్వీకరించడు. ఈ విషయాన్ని వివరించడానికీ, వాడిన గడ్డిపూలయినా శివునిశిరస్సు నలంకరిస్తాయనే విషయాన్ని నిరూపించడానికీ 'పేదపూజ' ఖండిక రచించబడింది. 'వాడిన గుడ్డిపూలు గొనివచ్చెను వీడని జాలిమాలి నోనాడకుమో దయామయ' అని ప్రార్థిస్తున్నారు జాలిగల భగవంతుని. 'ఆదరింతువా లేదా నా బీదపూజ' అని స్వామిని అనుమానంతో, అనురాగంతో ప్రశ్నిస్తున్నారు.

గడ్డిపూవుగాని, గుడ్డిపూవుగాని ప్రకృతిలో ఉద్భవించిన పుష్పం ప్రకృతిలోనే కలిసిపోవాలి. అందాలు దిద్దుకోడానికీ, అత్తర్లు చేసుకోడానికీ, ప్రక్కలపై చల్లుకోడానికీ—చివరకు భగవంతుణ్ణి పూజించడానికైనా స్వతంత్రపుష్పాల నుపయోగించడానికి అధికారంలేదు. తల్లిఒడిలో, తలిరాకు తల్పమందు ఆడుకొనే పూబాలలు ఆయువు తీరినంతనే తీవతల్లి చల్లని కాలివ్రేళ్లపై రాలిపోవాలనే ఆకాంక్ష గలవి. మోక్షవిత్తముకొరకు మూగజీవులను త్రుంచి భగవంతున కమ్ముకొనే పూజ హృదయంలేని పూజ. హృదయంలేనిపూజలను విశ్వాత్ముడు స్వీకరించడు. విశ్వమానవప్రేమతత్వాన్ని బోధించిన

బుద్ధుడు జన్మించిన భూమిలో జన్మించి సుందర సుకుమారసుమాలను హత్యచేయడం ప్రేమ మరణించ టానికి చిహ్నం. ఈ భావాన్నే కవి

'బుద్ధదేవుని భూమిలో పుట్టినావు
సహజమగు ప్రేమ నీలోన చచ్చెనేమి
అందమును హత్యజేసెడి హంతకుండ
మైలపడిపోయెనోయి నీ మనుజ జన్మ'

అని కరుణరసప్లావితంగా వర్ణించారు. ఇటువంటి రక్తపూజను విశ్వాత్ముడు స్వీకరించునె అని పుష్పాలు నిలవేసి అడుగుతున్నాయి కరుణశ్రీ కీర్తిని దిగంతవిశ్రాంత మొనర్చిన భావఖండికలలో 'పుష్ప విలాపము' ప్రధానమైనది. ప్రకృతిలోని అచేతనముల బాధాగాథలను సైతము రమణీయముగా, హృదయ రంజకముగా వర్ణించిన నేర్పు అనన్యసామాన్యమైనది. భగవానుని పూజకు నిష్కల్మషహృదయము, మధుర భక్తి ఉంటే చాలు. ఈ భౌతికాడంబరములు అనవసర మైనవి. ఉపయోగరహితమైనవి. ఈ విషయమును కరుణశ్రీ అంజలి లో, బీదపూజ లో, పుష్పవిలాపము లో వర్ణించి భక్తిభావముపై తన మనోగతాభి ప్రాయాలను వెల్లడించారు.

## 4. దేశభక్తి కవిత్వం

'జననీజన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసి' అని ప్రాచీనుల సూక్తి. కాని ప్రాచీనులు అఖండభారతాన్ని ఊహించనైనాలేదు. వారి జన్మభూమి వారు నివ సించే ప్రదేశం మాత్రమే. తక్షశిల ఒక రాజ్యము. పాంచాలము శత్రురాజ్యము. ఈ రెండు రాజ్యాలూ పరస్పరవిద్వేషంతో ప్రమగ్గిపోయాయి. ఏ రాజ్యంలో నివసించే ప్రజలకు ఆ రాజ్యమే స్వర్గతుల్యము.

ఆంగ్లేయ పరిపాలనతో అఖండ భారతం రూపుదాల్చింది భారతీయునకు భారతీయుడననే భావం కలిగింది. భరతమాతను ఆర్యులు, ద్రావిడులు పూజ్యమాతగా భావించి నీరాజనాలిచ్చారు. దాస్యాంధ కారమేగాని స్వాతంత్ర్యభానూదయరేఖలు వీక్షించని భారతీయులు దేశదాస్యవిముక్తికై దీక్ష పూనారు. దేశనాయకులు దేశస్వాతంత్ర్యంకోసం తీవ్రంగా శ్రమిం చారు. ప్రజలను ఉపన్యాసాలతో ప్రబోధించారు. ప్రభుత్వం విధించే శిక్షలను శాంతితో అనుభవించారు. విజయమో, వీరస్వర్గమో అనే కర్మవీరభావం భార తీయుల హృదయాల్లో పరవళ్ళు త్రొక్కింది. ఉర వళ్ళు చూపింది. ఈ స్వాతంత్ర్యోద్యమం కవి కుమారులలో నిద్రాణములై ఉన్న జాతీయభావాలను జాగృతం చేసింది. ఊహా ప్రేయసిపై మధుర గీతాల నాలపించే ప్రేమజీవులను వీరపురుషులుగా మార్చింది. కదంతొక్కే, పదంపాడే వీరాధివీరులుగా తీర్చిదిద్దింది తమ కలం బలాన్ని లోకానికి చవి చూపారు కవివరేణ్యులు. ఆవేశంతో, ఆవేగంతో, ఆవే దనతో హృదయాన్ని చీల్చుకొనివచ్చిన ఈ స్వాతంత్ర్య భావపూరిత గీతాలు యావదాంధ్రులను ఉత్సాహ పరచినయ్. ఉద్రేకపరచినయ్. ఉద్వేగపరచినయ్. ఎముకలు క్రుళ్ళి, వయస్సు మళ్ళిన వారి నరనరాల్లో సైతం నెత్తురు నింపించి, శక్తులను పండించాయి. రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల, జాషువా, కొడాలి మాటలను ఈటెలుగా, బాకులుగా, చాకులుగా మార్చినవారే. కరుణశ్రీ భారతమన్న మాట వినగానే నిలువెల్లా కరిగిపోయే దేశభక్తుడే. జాతీయ భావాలు గుబాళించే కవితాగుచ్ఛాల్ని లెక్కకు మిక్కిలిగా కైసేసినవాడే.

దేశభక్తికవిత్వాన్ని రెండు శాఖలుగా విభజించ వచ్చు. అఖండ భారతంపై భక్తి. ఆంధ్రమాతపై భక్తి. ఏ దేశమేగినా, ఎందు కాలిడినా భూమి భార తిని పొగడమని దేశాభిమానాన్ని ప్రదర్శించినా, బౌద్ధులు విశ్వవిద్యాలయాలు స్థాపించిన ఆంధ్ర దేశాన్నీ, గడ్డపారలను గోగుకాడలవలె పేనిన ఆంధ్ర వీరులనూ ప్రత్యేక దృష్టితోనే వర్ణించారు. దేశం స్వకీయమైన దివ్యభవనం. స్వప్నం ముచ్చట గొలిపే వర్ణచిత్రాలతో మనసుకు నచ్చేటట్లు అలంకరించు కున్న స్వంత గది.

కరుణశ్రీ ఉదయశ్రీ గ్రంథంలో మాతృశ్రీ, స్వతంత్ర భారతి, ఆగస్టు విప్లవము, ముందడుగు, స్వచ్ఛందజాతి, భారతము అను ఖండికలు

భారతీయతను పుటికి పుచ్చుకున్న ఖండికలు. హిమాలయమును వకౌళి జుట్టిన మల్లెపూలచెండుగా, గోదావరి కృష్ణలు కటిసీమం బ్రేలాడు ఆణిముత్యాల సరులుగా, ఆంధ్రసముద్రము పాదాలజీరాడు పట్టుకుచ్చెల చెలుగుగా, నలుబదికోట్ల కుమారీ కుమారులే ఆత్మబలంగా భాసించే భరతమాత వేదమంత్రప్రపూత, విశ్వవిఖ్యాతయై, సుశీలయై వెలయవలెనని కవి ప్రగాఢ వాంఛ.

ఆగష్టువిప్లవము స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో సువర్ణాక్షరాలలో లిఖింపదగ్గ శుభఘడియ. పారతంత్ర్యపీడితయైన ప్రజాహృదయము పొంగులెత్తి యమునయై, గంగయై ప్రవహించి ఆంగ్లప్రభుత్వ సుందరభవనాన్ని ముంచిలేర్చింది. కరుణశ్రీ ఆగస్టు ప్రభావాన్ని ఆవేశంతో వివరించారు.

'లేచిపోయినవి పోలీసుల టోపీలు
వందలు వేలు రాబందు లట్లు
కాలిపోయినవి సర్కారు కచ్చేరీలు
ఖరదూషణాదుల కాష్ఠమట్లు
తెగిపోయినవి తంతితీగలు భారతీ
యుల పారతంత్ర్య శృంఖలములట్లు
తిరిగిపోయినవి క్రిందకు రైలుపట్టాలు
పాశ్చాత్యరాజ్య సౌభాగ్య మట్లు'

కవి ఆవేశంతో విప్లవగానం చేస్తున్నప్పుడు గూడా ఉపమానాల్ని ఎన్నుకోవడంలో చమత్కారం చూపారు. ఖరదూషణాదుల కాష్ఠాలు అన్యాయం దహింపబడడానికి చిహ్నం. పాశ్చాత్యరాజ్యం కూలడం, భారతీయుల దాస్యశృంఖలాలు తెగడం, విప్లవ పరిణామాల్ని దృశ్యీకరించడం కవి ఔచిత్యదృష్టికి సాక్ష్యాలు.

మన జాతీయత మంటగలిపి, పారతంత్ర్యాన్నాహ్వానించి ఆంగ్లేయుల పాదాలు తాకే అధికార వ్యామోహపరులకు భారతావని ప్రపంచఖ్యాతి నార్జించిన దేశమని ప్రపంచం అజ్ఞానాంధకారంలో కన్నుగానక, దిక్కుతోచక అలమటించే సమయంలోనే భారతావనిలో సుజ్ఞానమణిదీపికలు వెలిగాయనీ, చుట్టాలై వచ్చి దయ్యాలై పీడించినవారికి సైతం జ్ఞానభిక్ష పెట్టిందనీ కవి జ్ఞప్తిచేస్తున్నాడు. భారతజాతి చచ్చినజాతి, వెన్నిచ్చినజాతి కాదని వేనోళ్ల వ్యక్తీకరిస్తున్నాడు. స్వాతంత్ర్య సంపాదనానంతరం గణగణ మ్రోగిన విజయఘంటానినాదాల్ని విని ఆనందంతో గానం చేస్తున్నాడు. 'కంటికి కజ్జలము నిడి, ఖద్దరు చీరె ధరించి పొరుగింటివాల్గంటుల పేరంటానికి' పిలుస్తున్న స్వతంత్రభారతిని సాశ్రునయనాలతో, హ్లాదితహృదయంతో నేత్రానందంగా తిలకిస్తున్నాడు.

దేశమాతను స్వతంత్రను చేయడానికి తమ సర్వస్వాన్ని అంకితంచేసిన వీరాధివీరులు ఎందరో. దేశభక్తుల రక్తపుఅడుసుతో, ఎముకల ఇటుకలతో స్వేచ్ఛాభావపు పునాదులపై నిర్మింపబడ్డ దివ్యభవనం స్వతంత్రభారతం. 'జైహింద'న్న నూతన నినాదాన్ని సృజించి సింగారమ్మలు చిందే కన్గొలంకుల అంగారకణాల్ని రాలుస్తూ ప్రపంచానికి ధీరతాసందేశాన్నిచ్చిన నేతాజీ చరిత్రను సువర్ణ వర్ణాలతో లిఖించాడు. 'పొంగెడుగుండెలో పొరలిపోయెడు క్రాంతి కవోష్ణరక్తమే చెంగలువల్ గులాబులుగ చేసెను తల్లికి పాదపూజ మా బంగరు బోసుబాబని' కన్నీరుపెట్టిన గాంధిమహాత్ముని తలచి పాఠకులకు కన్నీరు తెప్పిస్తున్నాడు. కుపితకిశోరసుభంగి బ్రిటిషు మహాగజము శీర్షముపై చెంగున దూకిన భగత్సింగును, మిరపకాయ టపాసులా బ్రిటిషుబాబుల గుండెలలో బాంబులు పేల్చిన ఆంధ్రవీరుడు అల్లూరి సీతారామరాజును కృతజ్ఞతతో స్మరిస్తున్నాడు. జాతీయతాభావాలను కథాఖండికలలో సైతం వాపింపజేశాడు కరుణశ్రీ. 'భరత జనయిత్రి ఆనందబాష్పాలలోన' — 'కనులు గుట్టిన తెల్లమొగాలవారు'... మున్నగు చరణాలు వ్యంగ్యవాసనావాసితాలు.

స్వదేశాభిమానంతోబాటు స్వరాష్ట్రాభిమానం గూడా ఆంధ్రకవుల గుండెలలో గూడుకట్టుకున్నది. ఆంధ్రవిద్యార్థి, తెలుగుతల్లి, జయోస్తు, కవితా కుమారి, తెలుగువెలుగులు, రాష్ట్రసిద్ధి మొదలైన గీతాలు కవి అచ్చతెనుగుదనాన్ని ప్రతిఫలింప జేస్తున్నాయి. ఆంధ్రభాషను, ఆంధ్రదేశాన్ని, ఆంధ్ర

వీరులను తలచుకొని ఆనందించాడు - ప్రస్తుతాన్ని భావించి నిట్టూర్పు విడిచాడు. సందేశా లిచ్చాడు. ఆంధ్రవిద్యార్థి ప్రతిభాసంపత్తులను వ్యక్తీకరిస్తున్న ఘట్టం కమనీయఘట్టం. వాణి వాయించు మాణిక్య వీణలోని అర మెరిగిన ఆంధ్రవిద్యార్థి తెనుగుదోటల సంస్కృత వనంతాళి నంటుద్రొక్కించుచు బమ్మెర వారి మందారమకరంద మధుర వృష్టిని ఆస్వాదిస్తూ, తిమ్మనగారి వినూత్న పారిజాతపరిమళాల్ని మూర్కొనుచూ, పెద్దనగారి దాక్షాగుళుచ్ఛ సుధా రసధారను చవిచూస్తూ, పింగళివారి వరకళాప్రపూర్ణ సౌవర్ణశిఖరిని విహరిస్తూ ఆనందిస్తున్నాడు. ఆ అదృష్టానికి కవి కరుణశ్రీ మురిసిపోతున్నాడు

పురాతన వైభవసంపత్తిని జ్ఞాపకంచేసుకొని ప్రస్తుత హీనస్థితికి నిట్టూర్పు విడుస్తూ, కన్నీరు రాలుస్తూ తెనుగుతల్లిని బిడ్డలను తీర్చిదిద్దుకోమని కవి హెచ్చరిస్తున్నాడు తెనుగుసీమ వీరభూమి. శత్రువులను నడిదురంలో ఖండించడమో, వీరవిహారం చేస్తూ అసువు లర్పించడమో — రెండేరెండు మార్గాలు. అట్లా వర్థిల్లిన స్వర్ణసామ్రాజ్యాలను తలచుకొని కవి కుమిలిపోతున్నాడు. కాకతీయ జయ పతాక, విద్యానగర విజయ దుందుభుల మోత, తాండ్ర పాపయ తళతళలబాకు, పల్నాటియోధుల సింహనాద లక్ష్మి కథావశేషమైపోయిందని, గుడ్డగట్టిన కడిపెడుకొడుకులుండి యిల్లు వాకిలి కరవైన తల్లి అరవలవాకిట గడపాల్సివచ్చిన ఆంధ్రమాతను భావించి బాధ చెందుతున్నాడు. రాయలవంటి రాజులు, శ్రీనాథునివంటి కవులు, గోపన్నవంటి భక్తులు, పాపరాయనివంటి వీరులులేని ఆంధ్రభూమి నూహించలేకున్నాడు. రాజులు పిసినిగొట్టులు కారాదు. కవులు దిగంబరత్వాన్ని ప్రదర్శించరాదు. భక్తుడు వేషధారి కారాదు, వీరులు పిరికిమందు సేవించరాదు. పూర్వుల ప్రాభవాన్ని పొగిడినంతమాత్రాన కవీశ్వరునకు ప్రస్తుతంపై, భవిష్యత్తుపై విశ్వాసం లేక పోలేదు. 'జయోస్తు' గీతంలో పూర్వవైభవాన్ని వర్ణించిన కవి 'కవితాకుమారి' ఖండికలో నవ్య సాహిత్య సింహాసనంపై అధిష్ఠింపజేసి కవితాకుమారి సౌందర్యానికి వారసులైన కవులను భక్తితో స్మరిస్తున్నాడు.

'జడయల్లి జడకుచ్చులిడ' రాయప్రోలు, తల్లావఝల కిరీటలక్ష్మి నింప
'పింగళి' కాటూరి ముంగురుల్ సవరింప
'దేవులపల్లి' శ్రీ తిలక ముంప
'విశ్వనాథ' వినూత్నవిధుల కిన్నెర మీట
'తుమ్మల'రాష్ట్ర గాన మొ్మనర్ప
'వేదుల' 'నాయని' వింజామరలు వీవ
'బసవరాజు' 'కొడాలి' పదము లొత్త
'అడివి' 'నండూరి' భరతనాట్యములు సలుప
'జాషువా' 'ఏటుకూరి' హెచ్చరిక లిడగ
నవ్యసాహిత్య సింహాసనమున నీకు
ఆంధ్ర కవితాకుమారి దీర్ఘాయురస్తు.

భారతదేశ దాస్యశృంఖలాలు ఖణిల్లుమని తెగి పడ్డాయి. స్వాతంత్ర్యంకోసం సర్వస్వమూ త్యజించిన వీరులు ఆంధ్రరాష్ట్రోద్యమానికై నడుములు బిగించారు. కాని స్వాతంత్ర్య పోరాటంలో చూపిన ఐక్య భావం రాష్ట్రసిద్ధి విషయంలో చూపలేకపోయారు. తమలోతాము కీచులాడుకున్నారు మేలుకొని రాష్ట్రమేలుకోమని నిద్రాళువులైన ఆంధ్రులను, జాగృతులను గావించాడు కరుణశ్రీ వైతాళికునిలా.

## 5. సంఘసంస్కరణ కవిత్వం

కరుణశ్రీ కరుణసాహితిని, విజయసాహితిని చేపట్టి జోడుగుర్రాలపై స్వారిచేసిన కవీశ్వరుడు. దేశస్వాతంత్ర్యంకోసం బ్రదుకులను బలి యొనర్చిన వీరనాయకుల గాథలను గానం చేశాడు. ప్రపంచం ప్రేమమయమని కరుణమూర్తి బుద్ధదేవుని జీవితాన్ని రచించాడు. సమకాలీన పీడిత తాడిత జనులపై సానుభూతి కనబరుస్తూ భేదాలులేని మతోలోకాన్ని సృజించాలని ప్రబోధంచేసి 'పాకీపిల్ల' ఖండికను రచించి సంఘసంస్కరణ కవిత్వాన్ని ఆదరించాడు. 'పాకీపిల్ల' సంఘంలో అట్టడుగునపడి బాధ చెందుతున్న స్త్రీమూర్తి. కుక్షిస్థమయిన కుళ్లేరుంగని రిక్షాలో దర్జాగావెళ్లే వ్యక్తి పాకీపిల్లపై కళ్లెఱ్ఱ చెయ్యడం చూచి కళ్లెఱ్ఱచేశాడు. పాకీపిల్లను మాతృదేవతతో సమానంగా భావించి పూజించాడు. లోకుల

అశుద్ధాన్ని శుభ్రపరిచే ఈ వృత్తికి మించిన వృత్తు లకు కొదువలేదు. కూటికొఱకు అవలంబించే కోటి విద్యల్లో ఏదో ఒక వృత్తిని చేపట్టి ఈ దుర్గంధ వాతావరణాన్ని వీడమని అతినమ్రతాధోరణిలో ఆదేశించాడు.

కరుణశ్రీ రచించిన అనంతర కావ్యాల్లో సంఘంలో ధనవంతుల దౌర్జన్యాలకు, కుటిలనీతుల పన్నాగాలకు బలైపోతున్న విషాదమూర్తులను అధి కంగా వర్ణించారు. నిద్రిస్తున్నవారిని మేల్కొల్పి డానికీ, మేల్కొన్నవారిని మున్ముందుకు నడిపించ టానికీ ఈ కవినుండి వెలువడిన కిరణాలే 'అరుణ కిరణాలు'. ఇందులో 'తప్పులేని తమ్ముడు' 'బీదా పాదా' 'వ్యత్యాసాలు' అనే ఖండికల్లోని భావాలు ప్రగతికి సోపానాలు. ఈ విశ్వంలో మానవులంతా సోదరులు. అంతా ప్రకృతిమాతసంతానం. ఉచ్చ నీచాల వ్యత్యాసాల్ని పాటించే నీచుల్ని కన్నతల్లిగూడా క్షమించదు. మాలవారని గేలిచేస్తున్న పెద్దింటి బిడ్డల్ని చూసి ప్రకృతిమాత విషాదం ఉట్టిపడుతున్న కంఠంతో

'ధ్వజస్తంభముకాడ, దణ్ణాలు పెడుతుంటే
మడిగట్టికూర్చున్న, గుడిలోని జేజాయి
మైలపడ్డునన్నారు టే — నాయన్ని
మాలవాడన్నారుటే' అని కుమారుల రాక్ష

సత్వాన్ని దూషించింది. తప్పులేని తమ్ముణ్ణి ఓదార్చింది.

ఉందామంటే కొంపా, తిందామంటే తిండీ, కొందామంటే పైసాలేక యంత్రభూతాలకోరలు తోముతూ సాదా జీవితానికిగూడా నోచుకొని కటిక పేదలకష్టాలకు దుఃఖించి వ్యత్యాసాలులేని నూతన లోకాన్ని కలగంటున్నాడు. మత్తులోంచి తమను మేల్కొనమన్నారని, కాంతిరేపు కనులు విప్పమన్నారని అజ్ఞానాన్ని తొలగించుకోమన్నారని సోక్రటీసులనూ, ఏసుక్రీస్తులనూ, గాంధీమహాత్ములనూ అంతంచేసిన ఈ అర్ధాంధులు నీతిబోధలను పెడచెవినపెట్టక వింటారా! అయినా ప్రయత్నం తప్పదు. ఆ ప్రయత్నంలో కవి కరుణశ్రీ వెనుకంజవేయలేదు.

## 6. స్మృతిగీతాలు

ఇష్టమైన వ్యక్తి మరణించిన సందర్భాల్లో కలిగిన దుఃఖాన్ని వివరిస్తూ వ్రాసే కవిత్వము శోక గీతము, స్మృతిగీతము అనేపేర్లతో పిలువబడింది. కవులు తమను ఆదరించి సకలసౌభాగ్యాలతో తులతూగించి ప్రభువుల మరణానంతరం కలిగిన కష్టాలను భరించలేక వారిని తలుచుకుంటూ చెప్పిన పద్యాలుతప్ప ప్రత్యేకించి స్మృతిగీతాలు వెలయలేదు పూర్వం ఈ ఫలం ఆంధ్రభాషావృక్షానికి ఆంగ్లభాషా ప్రభావాన్ని అంటుగట్టిన తర్వాత పూచి ఫలించిందే. ఆంగ్లంలో స్మృతిగీతాలు 'ఎలిజీ' అనే నామంతో ప్రసిద్ధిచెందాయి. ఈ స్మృతిగీతాలలో దేశనాయక స్మృతి, సతీస్మృతి, ఆప్తస్మృతి ప్రముఖమైనవి. ఆప్తులలో బంధుకోటిలోనివారందరూ చేరినను సహ చారిణి కొకప్రత్యేకత. కరుణశ్రీ స్మృతిగీతాలు దేశ నాయకపరమైన స్మృతిగీతాలు. భగత్సింగు, నేతాజీ, సీతారామరాజు మొదలైనవీరుల చరిత్రలను వర్ణిం చినా, ఆపద్యాలలో ఆయానాయకుల సాహసకృత్యాల కిచ్చిన ప్రాధాన్యత వారి మరణానికి కృంగిపోతూ గీతాలు రచించడాని కీయలేదు " గాంధీజీ స్మృతిని వర్ణించే ఘట్టములలో స్మృతిగీతం పరిపూర్ణతను పొందింది.

భారత స్వాతంత్ర్య సంగ్రామచరిత్ర ప్రపంచ స్వాతంత్ర్యచరిత్రలో ప్రత్యేకతగల చరిత్ర ప్రపం చంలో స్వాతంత్ర్యపోరాటాన్ని నడపడంలో, స్వాతం త్ర్యాన్నిపొందడంలో భారతదేశమే ప్రప్రథమదేశం కాదు. ఎన్నిదేశాలు స్వాతంత్ర్యాన్నిపొందినా యుద్ధా లతో, హత్యలతో, రక్తపాతంతోగాని స్వతంత్రబావు టాను రెపరెపలాడించపోయాయి. శాంతిసంగ్రామంతో సత్యాగ్రహసాధనంతో పారతంత్ర్యపిశాచాన్ని పార ద్రోలడం అపూర్వం. స్వాతంత్ర్య సంగ్రామ రథానికి సారథియై స్వేచ్ఛాపథం వెంట నడిపించి ఢిల్లీ కోటపై త్రివర్ణపతాకాన్ని కనులారగాంచిన వ్యక్తి మహాత్ముడు. 'కొల్లాయిగట్టితేనేమిరా మా గాంధి కోమటైపుట్టితేనేమిరా' అని, 'అడుగువెట్టినచాలు

అవనీంద్ర రత్న రంజిత కిరీటములు హారతులొసగు నని' కవివరేణ్యులు కవితాసుమాలతో పూజించారు.

మానవుడెన్నో మహత్తరకార్యాలు సాధించాడు. సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగాడు. అవధివిహారి ఆకాశంలోని చందమామపై ఆటలాడటానికి ప్రయత్నిస్తున్నాడు ఎన్ని సాధించినా కళ్ళెంలేని గుఱ్ఱంలా విహరించే మనస్సును అదుపులోపెట్టుకోవటం ప్రధానం. ఆదే సత్యమైన నిత్యమైన విషయం. ఈ చరాచర సృష్టికంతకూ మూలకారణుడైన భగవంతుని పలురూపాలతో పూజించి ఏకత్వాన్ని చీల్చి చెండాడిన అజ్ఞానులు 'ఈశ్వరఅల్లాతేరేనామ్' అని సమతాభావాన్ని బోధింపజేసిన జాతిపితను గుండుదెబ్బకు గురిచేయడానికి వెనుకాడలేదు. గాంధీజీ హత్యావార్తవిని కరుణశ్రీ దుఃఖంలో మునిగిపోయాడు. సత్యసహకారానికి అహింసా లతల నల్లికవెట్టి పూలు పూయించి తేనెలు జాలువార్చి, మాలలుగూర్చి భరతమాత కంఠసీమ నలంకరించి దివికేగిన దివ్యమూర్తి బాపుజీ మరణానికి కారకుడైన భగవంతునిపై నిప్పులు చిమ్ముతున్నాడు. బాపూజీ మరణము కవి పేదహృదయములో హంతకుడు గుచ్చినవాడికత్తి. ప్రభువు ప్రపంచముపై కోపించి రాల్చిన పిడుగుపాటు. ప్రాచీబాలకపోలపాళికలపై నూత్నకాంతులు విలసిల్లు సమయాన భారతోదాత్త నిదర్శనమగు ప్రదర్శనమని ఆశపెట్టి మహాభయంకర ఉన్మత్త పిశాచ నాట్యమును కాన్పింపజేసిన భగవానుని దూషించలేక, చూడలేక తెరవేసిన దీపాలార్పమని ఘోషించాడు కవి. ధర్మంపై అధర్మం సాధించిన విజయాన్ని సహించలేక

'హింస యహింసపై పగ వహించె
నవోదయశక్తి విూద వి
ధ్వంసకశక్తి దూకిన,
దధర్మము ధర్మము నాక్రమించె, దు
ర్మాంసబుభుక్ష రాక్షసకరమ్ము
ప్రశాంత మరుత్తరంగిణీ
హంసమువేసె, సాంధ్యసమయమ్మున
విశ్వము విహ్వలింపగన్' అని వర్ణించాడు.

ఈ క్రూర మానవలోకం మహాత్ముణ్ణి చేజేతులా పోగొట్టుకుంది. స్వర్గం ఈ నిండు మనస్వికి హార్దికస్వాగత మిచ్చింది. స్వర్వీథుల బాపూజీ రథం సాగుతుండగా సౌధాగ్రాలపైన బాపూజీ బోసినోటి మాటలతో సాధించిన ఘనకార్యాలను తలచుకుంటూ నేత్రాలను విశాలంచేసుకొని దర్శిస్తున్నారు దేవకాంతలు. కారణజన్ముడైన గాంధీజీ కార్యాన్ని ముగించి మరణించినా భారతజాతి చరిత్రలో శాంతిగానా న్నాలపిస్తున్న కరుణహృదయుని క్రూరస్వాంతుడై స్వమతస్థుడే కాల్చి చంపాడన్న కళంకం తొలగించడానికి మార్గమేది? చరిత్రలో ఈ విషక్షణాన్ని తలచుకొని భావిభారతపౌరులు సిగ్గుబరువుతో శిరసువంచి దుఃఖగరళాన్ని మ్రింగక తప్పదు గదా అని కరుణశ్రీ విలాపం. హృదయంలో అణచుకోలేని దుఃఖభారాన్నంతా మూగవోయిన లేఖినితో శోకగీతాలు రచించి ఆంధ్రుల హృదయాల్లో మూగబాధను ఉద్భవింపజేశారు కరుణశ్రీ.

పై వివరణవలన కరుణశ్రీ భావకవితాశాఖల శాఖలన్నిటినీ పోషించి కమనీయకవితాఫలాలతో ఆంధ్రులకు కమ్మనివిందు చేశారని సుస్పష్టం. యమునాతీరాన విహరించే రాధామాధవుల పవిత్ర ప్రణయవృత్తాంతంగాని, మానవుని మహిషబుద్ధికి భయపడి జాలిగ నోళ్ళువిప్పిన పూబాలజీవిగాథగాని, వెదకివెదకి వేసారినా గడ్డిపూవేగాని మకరందం జాలువారే మల్లెమొగ్గలు దొరకని పేదవాని బీజపూజగాని, ఒకే తల్లికడుపున జన్మించినా ఆటలలో, పాటలలో అల్లంతదూరానఉంచే అన్నలను తలచి బాధపడే తప్పులేని తమ్ముని కన్నీళ్లనుగాని- వర్ణించే వస్తువుయేదైనా కవితాశక్తితో పాఠకుల్ని తన్మయుల్ని చేయగల శక్తి కరుణశ్రీలో పుష్కలం. పఠించిన పద్యమైనా పదేపదే పఠించాలనే కోర్కె కలగడానికి కారణం కరుణశ్రీ కవిత్వంలోని అక్షర రమ్యత. నానారుచిరార్థసూక్తినిధిత్వం. కరుణశ్రీ కవిత్వం అంటే హృదయం పరవళ్ళు త్రొక్కడానికి ఇదే కారణం. 'ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా' అని వేమకూర నిష్ఠురోక్తి. ఈగతి రచియించిరేని కలకాలమువారలు మెత్తురేగదా అని యావదాంధ్రుల సుస్పష్టోక్తి.

# గెంజిగాథ

## శ్రీ కె. ఇసాక్

'గెంజి' రాకుమారుడు. అతని శృంగార జీవితం చిత్రించే నవల గెంజిగాథ శ్రీమతి మురాసకి ఈ నవల వ్రాశారు. జపానుదేశచరిత్ర ఈ నవలకు నేపథ్యం. రచనాకాలం, కథాకాలం పదకొండో శతాబ్దం

చక్రవర్తి ప్రియురాలు 'కిరీటశుభ'. పట్టమహిషి కొకిదేను మహారాణి. కిరీటశుభ ఏకైక పుత్రుడు గెంజి. తండ్రి అనురాగం పొందిన సుందరాకారుడు. తేజోరాశి. బాల్యంలోనే తల్లిని కోల్పోయాడు.

సౌందర్యం, ఆభిజాత్యం, సంపద, యౌవనం గెంజి జీవితాన్ని శృంగారమయం చేశాయి. వయస్సులో తనకంటె పెద్దవారయిన స్త్రీలేకాదు; చాలాచిన్నవారయిన యువతులతో శృంగార జీవితం సాగించిన రసికుడు గెంజి. ప్రేమమయహృదయంలో చెలరేగే సుఖదుఃఖతరంగాలకు ఇరు దరులు తానే అయి నిలిచిన మనోహర మూర్తి గెంజి.

ప్రేమమయుడయిన ఒక నిష్కల్మష హృదయుడి శృంగారజీవితంతో సంతోష సంరంభాలు, మానసికసంక్షోభాలు, స్వీకృతప్రేమాహ్వానాలు, తిరస్కృత శృంగార సంబంధాలు, మధుర వాంఛా సాఫల్యాలు, విధి దూషిత వైఫల్యాలు, సమగ్రంగా చిత్రింపబడిన నవల గెంజిగాథ.

పలువురు స్త్రీలతో శృంగార జీవితం తప్పు అనటం అసాధ్యంగా కనిపిస్తుంది ఈ నవలలో. అది నిజంగా దూషింపబడవలసింది అయితే, అటువంటి పరిస్థితి ఏర్పడటంలోనే దూషింపబడవలసిన సంగతి వుంది. శారీరకకాంక్షకు అడ్డమాకలులేక, అవధీ పరిధీ మృగ్యమైన సామాన్యకామంలాగా చిత్రింపబడలేదు, శృంగారం ఈ నవలలో. శృంగారం ఈ రచయిత్రి పూజగా, తపస్సుగా, ఆరాధనగా, భగవద్దత్త సామర్థ్యంగా, దైవదర్శన సముజ్జ్వలంగా, దైవత్వ సముపేతంగా, మనోహర జీవిత భాగధేయంగా చిత్రింపబడింది.

ఆధునిక సమాజంలో తలంపబడే నీతి నియమాలు వెయ్యేళ్ళ పూర్వం వ్రాయబడిన ఈ నవలలో పరిశీలింప బూనుకోవటం హాస్యాస్పదంగా వుంటుంది. తన జీవితం, తనచుట్టూ ఉన్న ప్రకృతి జీవితం, మానవ ప్రకృతి జీవితం పరిపూర్ణంగా అర్థం చేసుకొని, ఆనందం జీవిత పరమార్థంగా భావించి జీవించిన గెంజి ఉదాత్త పాత్ర!

గెంజి కల్పిత పాత్రకాదు. ఒకనాడు జీవించిన వ్యక్తి. ఇప్పుడూ జీవిస్తున్న పాత్ర ఈ నవలలో పేర్కొన్న ఏ పాత్రా కల్పితం కాదు అన్నీ ఒకనాడు వాస్తవాలయిన పాత్రలు. గెంజి తండ్రిని, మహారాజు—చక్రవర్తి, సార్వభౌముడు అని మాత్రమే రచయిత్రి పేర్కొంది. కాని పేరు చెప్పలేదు మహారాజును పేరుతో పిలవటం ఆచారంకాదు. ఆ స్థానంలోనే ఉన్న శ్రీమతి మురాసకి మహారాజుపేరు ఈ నవలలో వ్రాయలేదు.

### రచనా కాలం

గెంజి గాథ రచనాకాలం గూర్చి తెలుసుకోటానికి రచయిత్రి జీవితకాలం నిర్ణయించుకొనవలసిన అవసరం వుంది. ఆమె క్రీ. శ. 978 (?) 1031 (?) లో జీవించి ఉన్నట్లు చెప్పబడింది.1

నవల రచనా కాలంగూర్చి క్రీ. శ 1000 అని రమారమిగా వ్యక్తం చెయబడింది.

The novel is undoubtedly the finest example of medieval Japanese story-telling, and in it one can trace the very growth of Japanese literature about the year 1000 A. D.2

---

1, 2—Master Pieces of World Literature in Digest Form-second series—Edited by Frank. N. Magill.

అయితే మాన్యశ్రీ సైజిరో యోషిజవ శ్రీమతి మురాసఖి షికిబు జీవితకాలం క్రీ॥ శ॥ 975–1031 మధ్యకాలంగా చెప్పి, రచనాకాలం క్రీ॥ శ॥ 1008—1021 గా వ్రాస్తే, ఆ విషయం అనువాదకర్తకు స్వీకరణ యోగ్యంగా గోచరించింది.

అది, గాసట బీసటగానున్న భాషకు దారి చూపిన మహోద్ధరుడు, ఋషితుల్యుడు అయిన నన్నయ రాజరాజు కొలువులో, రాజమహేంద్రవరంలో వ్యాసరచిత మహాభారతం తెలుగులోకి అనువాదం చేస్తున్న సమయం.

## రచనా ప్రక్రియ

హృదయగత సౌకుమార్య కోమలత్వాలు వెనకడుగు వేసినప్పుడు, సమాజం పారిశ్రామికంగా ముందడుగువేసినప్పుడు, కవితాహృదయంకంటే యంత్రజీవితం సంఘంలో ప్రముఖమయినప్పుడు, అధునాతననాగరికత విలువలుపలవలుగా విస్తరిల్లినప్పుడు, పద్యరచన తిరోగమనంలో, గద్యరచన పురోగమనంలో పయనించే అవకాశంగూర్చి సహృదయులు ఎరుగుదురు.

గెంజిగాథ వచనంలో సాగిన రచనే అయినప్పటికి చక్కని కవితారూపం. రసపారవశ్యం కలిగింప సమర్థమయిన శిలాఖండం.

ఆంధ్రంలోనూ వచన రచన అంతో యింతో నన్నయకాలంనుంచీ ఉందని అంగీకరించినా, పరిపూర్ణరూపం పందొమ్మిదో శతాబ్దంలోనే లభ్యమయింది.

గెంజిగాథ 'నవల' అని స్థూలంగా అందరూ అంగీకరించారు. అంగీకరిస్తారు. అయితే జపాను దేశంలో దీనిని గెంజి మొనొగతరి (monogatari) అని పిలుస్తారు మొనొగతరి అంటే Tale అని ఇంగ్లీషులో అర్థం చెప్పబడింది. కాబట్టి దీనిని గాథ అనటంలో విప్రతిపత్తి ఏమీ లేదు.

అయితే ఈ గెంజిగాథను, మురాసఖి షికిబు 'నిక్కి' అని సమకాలికులు పిలిచేవారు. నిక్కి (nikki) అంటే Dairy అనే అర్థం ప్రాచుర్యం పొందింది.

గెంజిగాథను లేడీ మురాసఖి షికింబు డైరీ అనుకొంటే, ఆ గాథలో ఆమె దినచర్య మాత్రమే (?) లేదు. గెంజిగాథలో మురాసఖి అనే పాత్ర, రచయిత్రి మురాసఖి అయివుంటుందనుకొంటే అది విషయాంతరం అయినా ఈ గాథ ఆమె దినచర్యకంటే గెంజి దినచర్యగా వ్రాయబడింది. దీనిని స్వీయచరిత్రకంటే, జీవితచరిత్ర అని భావించే అవకాశం ఉంది.

గెంజిగాథను గాథే అనినా, దినచర్య అనినా అనవచ్చుగాని, నవలా రచన ముమ్మరంగా సాగే ఈ కాలంలో దీనిని నవలాగా భావింపవచ్చు.[4] అంతేకాదు. నవలా రచనకు ప్రథమరూపం ఈ గెంజిగాథ అని తలపోయవచ్చు. ఈ దృష్టితో నవలా రచన జపాను దేశంలో ప్రారంభమయింది అనటం దూరాన్వయం కాకపోవచ్చు.

ఈ నవల లేడీ మురాసఖి షికిబు డైరీగా ఆలోచిస్తే, నవలలో అక్కడక్కడ రచయిత్రి పాత్రలతో స్వయంగా మాట్లాడటం గమనింపవచ్చు.

The details of the plan by which he brought* this about would make a tedious story, and as is my rule in such cases I have thought it better to omit them.5

---

3. భారతదేశంలో జపాను రాయబారి (1962).

4. ............Highly developed culture which flourished in Japan when Europe was just beginning to emerge from the dark ages.—Observer.

(From the Tale of Genji translated by Arthur Waley.)

5. Page 103. 'The Tale of Gengi, translated from Japanese by Arthur Waley and published by George Allen Unwin Ltd; London (etc). Reprinted, Nov. 1927.

ఆ ఉపాయములు పన్నాగములు వివరించుట గ్రంథ విస్తర భీతిచేత విరమించుచున్నాను. (అనువాదం పేజీ 101).

అనువాదంలో ఉన్న వ్యత్యాసం గూర్చి ఇక్కడ ప్రస్తావించటం లేదు తెలుగువాక్యం చదివి రచయిత్రి రచనా నియమాలు తెలుసుకొనే అవకాశం తక్కువ అనవసర విషయాలు విస్తారంగా వ్రాసే పఠితృలోకానికి శ్రమ కలిగించినట్లవుతుందనీ, అది త్యజించటం తన లక్ష్యం అని, అది అందరూ గుర్తిస్తారో లేదో అనే భయంతో తన నియమం పాఠకులతో ప్రత్యక్షంగా చెబుతుంది రచయిత్రి.

.........And you would soon be saying that this was no history but a mere made-up tale designed to influence the judgement of posterity. As it is I shall be called a scandal-monger; but that I cannot help. (ఆంగ్లానువాదం పేజీ 134.)

ఇది రాబోవు తరములవారి అభిప్రాయముల మార్చుటకు అల్లిన కల్లబొల్లి కట్టుకథగాని, చరిత్రగాదని మీరనుకోవచ్చును. ఇప్పుడో నన్ను నీలాప నిందలు సృష్టించు నేరజాణ క్రింద జమకట్టవచ్చు. కానిందు ఐనవేనేమి చేయగలను. (ఆంధ్రానువాదం పేజీ. 137.)

ఇక్కడ అనువాద సామంజస్య పరిశీలన లేదు. రచయిత్రి హృదయ కాంక్షమాత్రమే దర్శితం. ఈ నవల కల్పనామయంకాదని, చరిత్ర సంగతి అనీ, అవాస్తవంకాదనీ, పూర్తి వాస్తవమనీ పఠితృలోకం భావించాలని తలంపు. అందుకే పాఠకులతో ముచ్చటించే అవకాశం కల్పించుకుంది.

## రచయిత్రి—కథానాయిక.

రచయిత్రి శ్రేష్ఠి మురాసకి షికిబు. కథానాయిక మురాసకి.

Lady Murasaki Shikibu, daughter of a famous Provincial Governor and widow of a lieutenant in the imperial guard......

As a lady in waiting to the Empress Akiko, she was completely familiar with Nipponese court ritual and ceremony, and her knowledge of Palace life is everywhere apparent in the adventures of her nobly-born hero, Prince Genji.[6]

తన ప్రేమపాత్ర పూర్ణంగా నింపి అసహాయంగా నగరం వెలుపల మందిరంలో మరణించిన పేరు తెలియని స్త్రీ హృదయంపై ముద్రించిన అనురాగం బరువు క్రుంగదీయగా, జబ్బుపడి మంత్రాలు తనకు ఆరోగ్యం కలిగిస్తాయని నమ్మి, సన్యాసిని చూడబోయి, అక్కడున్న బాలికనుగూర్చి విని, ఆమె యౌవనంలో ఎంతో అందంగా రూపొందుతుందని తలంచి, యాచించి తీసుకొని వచ్చాడు గెంజీ. ఆమె మురాసకి. తల్లి బాల్యంలో గతించింది. ఆమె తండ్రినిగూర్చి తర్వాత నవలలో ప్రస్తావింపబడుతుందిగాని, అధికారం గూర్చి ఏమీ తెలియదు.

నవలలో కథానాయిక అయిన మురాసకి రచయిత్రి మురాసకి ఒక్కరే కావచ్చునేమో అనిపించే అవకాశం వుంది. రచయిత్రి క్రీ॥ శ॥ 975 సంవత్సరంలో పుట్టింది. మురాసకి పదవఏట గెంజి అనురాగంవల్ల అంతఃపురంలోకి తీసుకొని రాబడింది. అంటే క్రీ॥ శ॥ 985 ఆమె గెంజికి పరిచయం అయింది. [illegible] రెండేళ్ళకు గెంజి ఆమెను రెండో భార్యగా చేసుకొన్నాడు. గెంజి మరణించిందర్వాత కూడా ఆమె జీవించి వుంది

గెంజి రాకుమారుడేకాని, చక్రవర్తి అయినట్లు ఆధారాలు లేవు. ముఖ్యోద్యోగి అయివుంటాడు. గెంజి లెఫ్టినెంట్ అయితే అయివుండవచ్చు. గెంజి మరణానంతరం మురాసకి ఆస్థాన జీవితమే గడిపి వుండవచ్చు. ఇది ఊహామాత్రమే! లభ్యమయ్యే చారిత్రక సత్యాలు ఆధారంగా రచయిత్రి—

---

6. Master Pieces of World Literature in Digest Form—Second Series—Edited by **Frank. N. Magill.**

కథానాయిక ఒక్కరే అని చెప్పే అవకాశంలేదు; వుంది.

నామధేయ సామ్యంవల్ల ఇరువురూ ఒక్కరే అని ఊహించే ప్రయత్నం చేయటం లేదు ఒక పేరు ఉన్నవాళ్లు ఎందరయినా ఉండవచ్చు. రాకుమారుడైన గెంజి ఆంతరంగిక విషయాలు వ్రాయటానికి అంతఃపురంలో ఉన్న స్త్రీలందరికీ సాధ్యంకాదు. నవలలో ఉన్న అనేక విషయాలు గెంజితో వ్యక్తిగత పరిచయం ఉన్నవాళ్లే వ్రాయగలరు. అందులోనూ భార్య అయితేనే తెలిసే విషయాలు కోకొల్లలు. ఈ నవల కల్పన కాదు వాస్తవం అని ఆమె పదేపదే చెప్పటానికి ప్రయత్నించింది ఈ నవల ప్రథమంగా ఆమె దినచర్యగా భావింపబడింది.

క్రీ. శ 987 లో గెంజి అనురాగం స్వీకరించిన మురాసకి రచనకు పూనుకొన్నది. క్రీ॥ శ॥ 1008 లో మాత్రమే! అప్పటికి గెంజికి పుత్రుడు కలిగి, ఆ కుమారుడి శృంగార జీవితంలో వాటిల్లిన అవాంతరాలు ప్రత్యక్షంగా చూచివుంటుంది. లభ్య చారిత్రకాధారాలతో రచయిత్రి-కథానాయిక అనే అవకాశం లేదుగానీ, రచయిత్రి కథానాయిక అయివుంటుంది అని సహృదయులు హృదయ పూర్వకంగా భావిస్తారు

**జపాను సాహిత్యం—స్త్రీల రచనలు**

సాధారణంగా, ఏ దేశ సారస్వత ప్రథమరూపం అయినా కవిత్వమే అవుతుంది. ఆ కవిత్వం గానలయాన్వితంగా వుంటుంది. శ్రీమతి మురాసకి వ్రాసిన గెంజిగాథ జపాను సాహిత్యంలో మొదటి దశకు చెందినదే! ఆ నవల వచనంలో ఉన్నప్పటికీ కవితామయమే !

జపాను దేశస్థుల రచనా జీవితం క్రీ॥ శ॥ 5 శతాబ్దంకంటే ముందే ప్రారంభమయింది. అయితే ఆ రచనలన్నీ చైనా భాషలోనే జరిగాయి (Encyclopaedia Britannica — 12 Vol). 10 శతాబ్దంలో 'కన' (Kana) లిపి ఏర్పడిన తర్వాత-(ఇప్పటి జపాను భాషా లిపికి ఆద్యరూపం) సంక్లిష్టమైన చైనా భాషను వదిలి అందులో రచనలు చేయసాగారు. అంతకుముందు జపాను దేశీయులు చైనాభాషలో రచనా వ్యాసంగం సాగించే వారు.[7]

శ్రీమతి మురాసకి జీవించిన సాహిత్యయుగం హైయన్‌యుగం ఆ యుగంలో ఆమె అగ్రగణ్య. ఆమె అబాల్య రచయిత్రి గద్యపద్యరచనలలో సిద్ధహస్త. ఆమె వ్రాసిన నవల వచనంలో సాగినా, కవితామయంగా, రసరమ్యంగా, ఆనందనిష్యందిగా, కళాఖండంగా గోచరిస్తుంది.

ఆంధ్రులకు 'రాయవాచకం' గుర్తుకువస్తుంది గెంజిగాథ చదువుతుంటే అయితే ఈ నవల ఒక్కనాటి ముచ్చటకాదు. ఒక జీవిత చిత్రణ. ఒక యుగాదర్శం. ఆంధ్ర సాహిత్యంలో ప్రబంధాలు ప్రదర్శించే రాజ్యజీవితంవంటిది—అంతకంటే అనేక విధాల విభిన్నమయిన రాజాస్థాన జీవితం ప్రదర్శిస్తుంది ఈ నవల.[8]

డైరీరూపంలో రచనలు చేయటం ఆ కాలంలో ప్రసిద్ధమే! శ్రీమతి మురాసకికంటే పూర్వం అటువంటి రచనలున్నాయి స్త్రీలు అధికంగా రచనా వ్యాసంగం సాగించినకాలం అది. పురుషులు శాస్త్ర విషయం మాత్రమే వ్రాసేవారు. కల్పనా సాహిత్యం పట్ల న్యూనభావం ఉండేది. అటువంటి రచనలు

---

7. The earliest Japanese texts were written not in Japanese, but in Chinese, partly because Chinese was regarded as more dignified and partly because Chinese characters were most suited for writing Japanese. (Encyclopaedia Britannica—12 Vol.)

8. The literary spirit of the classical period was sensitive and delicate, polished and refined, professing realisation of the impermanence of human existence, but actually safely sheltered by the tranquil security of court life. (Encyclopaedia Britannica-12 Vol.)

స్త్రీలు పోగించేవాళ్ళు[9]. శ్రీమతి మురాసఖి మహా ప్రఖ్యాత రచయిత్రిగా పేరు గాంచింది. గేంజిగాథ అత్యుత్తమ రచనగా కీర్తి నార్జించుకొంది.

స్త్రీకి స్వేచ్ఛ ఉన్న దేశంలోనుంచి ఇటువంటి ఉత్తమరచన ప్రపంచానికి కానుకగా వచ్చింది. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో మొల్లను తొలిగిస్తే స్త్రీలు ఎవరూ ఆంధ్రసాహిత్యంలో లేరనే చెప్పవలసివస్తుంది. దక్షిణాంధ్రయుగంలో రంగాజమ్మ, ఆ తర్వాత ముద్దుపళని పురుషలోకం ఇచ్చిన స్వేచ్ఛతో రచనలు చేసినవారుకారు, స్వేచ్ఛను హస్తగతం చేసుకొని రచించినవారు.

రంగాజమ్మ, విజయరాఘవ నాయకుణ్ణి నాయకుణ్ణిచేసి, చేసిన రచన మన్నారుదాసవిలాస నాటకం, యక్షగానం గుర్తుకురాకతప్పదు, శ్రీమతి మురాసఖి గెంజిని నాయకుణ్ణిచేసి, రచించిన గెంజిగాథ చూచిన తర్వాత. అయితే రంగాజమ్మవంటి వ్యక్తి, గుణశీలాదులలో, శ్రీమతి మురాసఖి కాదు.

అ ను వా ద ం

ఈ నవలను ఆర్థర్ వేలీ జపాను భాషనుంచి ఆంగ్లంలోకి అనువదిస్తే పత్రికలు ప్రశంసించాయి. చక్కని సమీక్షలు వచ్చాయి.[10] ఈ గెంజిగాథ ఆంగ్లానువాదానికి ఆంధ్రానువాదం.

ఆంధ్రానువాద కర్త డా॥ నండూరి రామకృష్ణమాచార్య ప్రయోగించిన బాష గ్రాంథికం. ఆంగ్లభాష నోచిననోము ఫలమేమో ఆర్థర్‌వేలీ వంటి అనువాదకర్త లభ్యం కావటం. ఆంధ్రానువాదం అంత ఉదాత్త స్థాయిలో లేదేమో అనిపిస్తుంది. అయితే, ఉన్నత స్థాయిలో ఉన్నత ప్రమాణాలతో అనువాదం చేయాలని ఆంధ్రానువాదకర్త ప్రయత్నం సర్వత్రా ప్రస్ఫుటం అవుతుంది.

ఆంధ్రానువాదంలో విశృంఖలమైన స్వేచ్ఛ లేదు. ఏ ఘట్టమూ విడిచిపెట్టబడలేదు. ఏ సన్నివేశమూ మార్చలేదు. ఇది అస్వతంత్రానువాదం. వీలైనంతవరకు యథామూలంగా అనువదించాలనే ప్రయత్నం గోచరిస్తుంది. అయితే ఆంగ్లవాక్యం ఆంధ్రంలో అవతరించే సమయంలో వాక్యరూపం మార్పుచెందక తప్పలేదు. ఒక్కొక్క వాక్యంలో కొంతకొంత భాగం అనువాదంలో కనిపించదు. కొంత కొత్త భాగం అతుక్కుంటుంది. ఈ విధమైన మార్పుచేసిన అన్నితావుల్లోను అందమే చిందలేదు.

స్వయంగా సుప్రసిద్ధ కవీ, నాటక రచయిత, అయిన డా॥ నండూరి రామకృష్ణమాచార్య అనువాదంలో ప్రదర్శించిన నేర్పు పాఠకుల్ని ఆకట్టుకొంటుంది ఆంగ్లానువాదం చదవకుండా ఆంధ్రానువాదమే చదివితే, ఆంధ్ర రచయిత స్వతంత్రంగా తెలుగులో కల్పించిన జపానుదేశానికి చెందిన చారిత్రాత్మక నవల అయి వుంటుందీ గెంజిగాథ అనిపిస్తుంది.

మూలంలో శ్రీమతి మురాసఖి కవితావేశం ప్రదర్శించే కమనీయఘట్టాలు ఆంగ్లంలోకి

---

9. Men wrote only serious treatises on learned subjects in chinese, dismissing fiction as trivial, women, holding an unrestricted position in contemporary society, were able to indulge freely in light literature writing easily in the simple kana, ('కన' లిపి సంక్లిష్ట చీనా వర్ణము ననుసరించి సాధించిన మాత్రానాక్షర సమామ్నాయము), instead of the complicated Chinese characters (స్పైజిరో యోషిజవ).

10. Mr Waley's translation is marvellous for the subtlety, precision, and beauty of its language—Saturday Review.

One of the few translations in our language that have all the stamp of a original genius -Daily Express.

I have nothing but enthusiasm for his translation as a whole—Punch.

(From the Tale of Gengi, translated by Arthur Waley.)

ఆర్థర్ వేలీ స్ఫూర్తి ఉమంతంగా తీసుకువచ్చినట్లు అంగీకరిస్తే, డా॥ నండూరి రామకృష్ణమాచార్య, ఆంగ్లానికీ మూలానికీ సౌందర్యం సముపార్జించే రీతిలో చేసిన కవితా రచన సహృదయులు సరసంగా స్వీకరిస్తారు

ఈ సుకుమార తూలికల
ఇంపుగ గూర్చిన దిండ్లతోడుతన్
నీ సహశయ్యపైన శయనించుట కంటెను,
పోయి, ఓ అవిశ్వాసిని,
కోపఘూర్ణిత కషాయముఖీ,
'నుకి' కొండకోనలో
ఆ సెలయేటి రాళ్ళపయి
హాయిగ నే నిదురింపనెంచెదన్.

(ఆంధ్రానువాదం - పేజీ 262)

Not softlier pillowed is my head
That rests by thine, unloving bride,
Than were those jagged stones my bed
Through which the falls of Nuki stride

(ఆంగ్లానువాదం - పేజీ 246)

Unloving bride కు అనువాదం లేక పోయినా, Jagged stones...కు తెలుగు పదం వ్రాయకపోయినా, కొండకోన ఆంగ్లంలో లేకపోయినా, సుకుమారతూలికలు, అవిశ్వాసిని, కోపఘూర్ణిత కషాయముఖీ పదాలప్రయోగం, సందర్భోచితంగా తోచి, మూలానికే వన్నెపెడుతుందా ఈ రచన అన్నంత ఆనందం కలిగిస్తుంది.

పతితహేమంతపత్త్రమర్మరారావములతో శ్రుతి గల్పుకొన్న పిల్లనగ్రోవిని పరవశే మొందించి నిలువగలిగిన పాట నే పాడగల్గుదునా!

(ఆంధ్రానువాదం—పేజీ 46)

Would that I had some song that might detain
The flute that bends its notes
With the low rustling of the autumn leaves.

(ఆంగ్లానువాదం—పేజీ 57.)

'పతిత' పద ప్రయోగంతో ఈ సందర్భంలో స్ఫురించే సున్నితమైన భావంకంటేకూడా, 'పతిత హేమంత పత్త్ర మర్మరారావములు'వంటి సమాన ఘటన ఆనందం కలిగిస్తుంది.

నేను ఆకాశయాత్ర చేయుచున్న చంద్ర వంకను—క్రూర పర్వత శిఖరముల మాటున ఏమి దాగియున్నదో తెలియదు. ఎంత ఎత్తున నున్ననేమి, వానిమాటున పడిన వెన్నెల మాసిపోవచ్చును

(ఆంధ్రానువాదం. పేజీ 108)

I am as the moon that walks the sky not knowing what menace the cruel hills may hold in store; high though she sweeps, her light may suddenly be blotted out.

(ఆంగ్లానువాదం—పేజీ 110)

ఆంగ్లంలోని పోలిక చ్యుతమైతే కావచ్చుగానీ, ఆంధ్రంలోని రమణీయతాస్ఫూర్తి ఆంగ్లంలో పరిశీల నాపేక్ష కలిగించక తప్పదు.

అనువాదం మధుర శబ్దజాలంతో, సుందర సమాస రచనతో, సరసవాక్యనిర్మాణంతో సాగినప్పటికీ, మూలంలోని భావాలకు రమణీయతను ఆపాదించే తీరులో సాగినప్పటికీ ఆంగ్లానువాదం తిరస్కరించిన తావులు లేకపోలేదు. తెలిసి తెలిసి ఆంగ్ల వాక్యార్థం అనువాదకర్త ఎందుకు మార్చవలసి వచ్చిందో, సాధించిన ప్రయోజనం ఏమిటో పాఠకులకు అర్థం కాలేదు.

నవలలో అర్ధభాగం యథాతథానువాదం పాతిక భాగం సరసమైన అనువాదం. ఆంగ్లంలోకంటే కవితా సౌందర్యం సాధించిన ఆంధ్రం. అయితే తక్కుంగల పాతికభాగం ఆంగ్లస్ఫూర్తి అర్థం కాకుండా చేసిన అనువాదం.

Then in a fit of wild and uncontrollable jealousy she began to pour upon me a torrent of bitter reproaches, and with a woman's savagery she suddenly seized my little finger and bit deep into it.

(ఆంగ్లానువాదం—పేజీ 52.)

ఇక పెద్ద గొంతుకతో చెలరేగిపోయి, నా విూద తిట్లవర్షము కురిపించినది. స్త్రీ సహజమైన క్రూరతతో నా చిటికెన వ్రేలు పట్టుకొని గట్టిగా కొరికి వేసినది.

(ఆంధ్రానువాదం-పేజీ-41)

ఇక పెద్ద గొంతుకతో — ఆంగ్లంలో లేదు wild and uncontrollable Jealousy కు అర్థం చెలరేగిపోయి అంటే చాలదు Savagery అంటే క్రూరతకాదు.

'There is a tendency among men as well as women' said Zemai nokami so soon as they have acquired a little knowledge of some kind, to want to display it to the best advantage. To have mastered all the difficulties in the Three Histories and Five Classics is no road to amiability.

(ఆంగ్లానువాదం - పేజీ 63)

ఆడవాళ్లలోగూడ పాండిత్య ప్రకటనమీద మక్కువ యెక్కువే ఇతిహాసత్రయము, పంచకావ్యాలు సరసతకు రాచబాట కానేరదు

(పేజీ 54)

కానేరదు కాదు, కానవసరంలేదు అవి, ఆడవాళ్లలో కాదు, ఆడవారిలో అవి వుండాలి ఆడవాళ్ల సంగతేగాని మగవాళ్ల సంగతి జారిపోయింది. to want to display it to the best advantage అనే లోకం సత్యం అనువాదం కాకుండా పోయింది.

Genji never asked her by what name he was to call her, nor did he reveal his own identity- We came very poorly dressed and—what was most unusual for him—on foot.

(పేజీ 103)

గెంజి ఆమె ఊరు పేరు అడుగలేదు. తన ప్రవర్తనను గూడ వెల్లడించలేదు అతడు సర్వసాధారణ వేషమునే ధరించియుండెడివాడు. అంతేగాక అతనికి అలవాటు లేకపోయినను పాదచారియై వచ్చెడు వాడు. (పేజీ 101)

Identity అంటే ప్రవర్తన కాదు. ఆంగ్లంలోని రెండవ వాక్యం ఆంధ్రంలో రెండు వాక్యాలు లయింది. వచ్చాడు అనే అర్థం రావలసిన చోట వచ్చెడువాడు వచ్చింది. అంతేకాదు ఆంగ్ల వాక్యార్థం తారుమారయింది. ఇలా మార్చటం ప్రమాదవశం కావచ్చు బుద్ధిపూర్వకమయితే సాధించిన ప్రయోజనం శూన్యం

నవలలోని కొన్ని పాత్రలపేర్లు తెలుగులో వ్రాసే తీరులో అనువాదకర్త స్వతంత్రతా ప్రవృత్తి ప్రదర్శించినట్లు పాఠకులు పోల్చుకొంటారు. అవి సుందరంగా గోచరించటంవల్ల ఆనందం పొందుతారు. ఉండవలసిన తీరుకంటే భిన్నంగా వుండటంవల్లనే పఠితృలోకామోదముద్ర లభ్యమవుతుంది.

Murasaki—Kiritsubo—మురసకి, కిరిట్సుబోగా వ్రాయాలి. అలాకాక అనువాదకర్త మురాసకి, కిరీటశుభగా వ్రాయటం భారతీయతా స్ఫూర్తితో స్వీకారయోగ్యంగా కనిపిస్తాయి. ఇటువంటివే అనేక నామధేయాలు.

ఇంకా, చాలా, బాగా, అంతా, కోసము, పోయింది, ఇవ్వవలెను, లేఖను, మనిషి, కలుసుకొని, చేసుకొని, తీసుకొని, వ్రాసుకొని, వర్షఋతువు, గ్రీష్మఋతువు, హేమంతఋతువు, వసంతఋతువు వంటి వ్యావహారిక రూపాలు నవలలో కనిపిస్తాయి.

9 వ పేజీలో 'నా కింకా'తో ప్రారంభమయ్యే పేరా వంటివి పరికిస్తే, ఇటువంటి పేరాలు కొన్ని అనువాదకర్త వ్రాయలేదేమో మరెవరయినా వ్రాశారేమో ననిపించే అవకాశం వుంది.

అనువాద విధానంలో, భాషాప్రయోగంలో కొన్ని వ్యత్యాసాల మాట కేమిగానీ, ఆంధ్రానువాదం ఆస్వాదయోగ్యంగా వుంది.

రచయిత్రి హృదయం

గెంజిగాథ అత్యుత్తమ నవల. రమారమి వెయ్యేళ్ల పూర్వం వ్రాయబడిన ఈ నవలతో (అప్పుడు నవల అనే పేరు లేకపోవచ్చు, ఈ రచనను మరో పేరుతో పిలిచి వుండవచ్చు) సరిసమా

నంగా చెప్పగల నవలలు ఈ కాలంలోకూడా ఎక్కువ లేవు అన్నది విజ్ఞుల అభిప్రాయం.[11]

గెంజిపాత్ర చిత్రణలో రచయిత్రి హృదయ కాంక్ష నిక్షిప్తం అయివుంది. ప్రేమైక జీవనుడయిన గెంజి ప్రణయ గాథలు సుకుమార హృదయులయిన పాఠకులను స్వప్నలోకంలో విహరింపజేసే సమర్థాలు. ప్రతిపాఠకుడు గెంజి పాత్రతో తాదాత్మ్యం పొందుతాడు. అతని ఆనందాలు భయాలు ఆశలు నిరాశలు తనివిగా అనుభూతి చెందుతాడు.

రచన వాస్తవంగా వుండాలనీ, కల్పన కారాదనీ రచయిత్రి అభిప్రాయం ఆ అభిమతం ఘంటాపథంగా కంఠోక్తిగా నవలలో ఎదను ఎక్కినప్పుడు ఆమె వ్యక్తం చేసింది అంతేకాదు. వాస్తవిక సమాజ చిత్రీకరణకోసం వాస్తవ చరిత్రను ఇతివృత్తంగా స్వీకరించింది

శృంగారం ప్రేమపట్ల ఆమె వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఉదాత్తమయినవి! ప్రేమభావం కోల్పోయినట్లు కోల్పోయేటట్లు గోచరించే ఆధునాతన సమాజంలో జీవించే మనిషి, ఈ నవల చదువుతూ వర్తమానంలోనే గతంలో జీవిస్తాడు. అందులో స్త్రీ పురుష తారతమ్యం కనిపించదు. గెంజిగాథ చదువుతున్నంతసేపు, ఒక క్రొత్త లోకంలో జీవించిన చదువరి, పుస్తకం మూసి, మామూలు లోకం చూచి, ఈ లోకంలో ఆ లోకం సృష్టించుకోవాలన్న ఆలోకనం కలిగించుకొంటాడు.

శ్రీమతి మురాసకి స్త్రీ పురుష సంబంధం పట్ల ఉన్న లోకదృష్టి, సక్రమమయిన మార్గంలో ఉంచాలని తాపత్రయపడింది. పతిత్వలోకం ఆమె జీవితాలమీద, అభిమానం, ప్రేమ, అనురాగం అభివృద్ధి చేసుకోవాలని తలంచింది తను వ్యక్తం చేయదలచుకొన్న ప్రతివిషయం సమగ్ర సానుభూతితో తిలకించింది. పరీక్షించింది. చిత్రించింది మనిషిని ఒక మహత్తర శక్తిగా దర్శించి రూపొందించింది. అందుకే ఆమె పాత్రలు సార్వకాలికాలు, సార్వజనీనాలు.

గెంజిగాథ చదివిన ఎవరికయినా క్రొత్త ఉత్సాహం ఉరకలు వేస్తుంది. చిత్రతమోవిస్తారంతో విచిత్రగతుల్లో పయనించే నేటి నాగరక జీవితం వెన్నువిహాద సూర్యోదయం ఈ నవల.

నవల రాజవంశానికి సంబంధించిన ఇతివృత్తం కలదే అయినా సమాజేతివృత్తంగా భావించుకొంటారు. గెంజి, రాకుమారుడే అయినా, అతని హృదయం ప్రతిసామాన్యమానవుడి హృదయమే! అతని ప్రభావం, ప్రత్యేకత, ప్రతిసన్నివేశం సామాన్యమానవుడికి సన్నిహితం.

శ్రీమతి మురాసకి ప్రేమను చాలా విశాల దృష్టితో పరికించింది. ఆమె నవల వలన ప్రేమమయజీవనం, ఆనందమయజీవనం ప్రబోధించాలని భావించుకొందనుకోవచ్చు. నిన్ను నువ్వు, నీ చుట్టూ ఉన్న ప్రకృతినీ, మానవప్రపంచాన్నీ ప్రేమించటం, ఆనందించటం, ఆ ప్రేమమయానందంలో అనంతత్వం అమృతత్వం, స్వర్గసుఖం నేర్చుకో! దేవుడిచ్చిన మహాప్రసాదం ప్రేమ. అది వ్యర్థం చేసుకోకు! ప్రేమే ఆనందానికి మూలం ఆనందమే బ్రహ్మ! అదే సృష్టి! బ్రహ్మ!! ఈ గెంజిగాథలో పరోక్షంగా ఉన్న రచయిత్రి ప్రత్యక్షంగా నుడివేసిన సూత్రం ప్రేమ!

ఈ నవల భారతీయభాషలన్నింటిలోకీ అనువదింపజేసిన కేంద్రసాహిత్య అకాడమీ ప్రశంసనీయమైన కృషి చేసింది.

అల్ప భాషా భావానువాద వ్యత్క్రమణాల మాట అటుంచి, చక్కని గ్రాంథికభాషలో, కవితాత్మ తరంగితంలయ్యే ధీరోదాత్త కోమలహృదయంతో, రమణీయ శబ్దస్ఫూర్తితో, మధురాక్షరభావవిన్యాసంతో, డా॥ పండురి రామకృష్ణమాచార్య చేసిన ఈ అనువాదం ఆంధ్రసంస్కృతికి అమూల్యాభరణం.

11. The Tale of Genji will probably prove one of the twelve great novels of the world—Nation. (From the Tale of Genji—translated by Arthur Waley.)

* భారతదేశ ప్రముఖ భాషల్లోకి ఈ నవల అనువదింపచేసిన కేంద్రసాహిత్య ఎకాడమీ భారతదేశ ప్రజలకు మేలుచేసింది ఆర్థర్ వేలీ ఆంగ్లంలోకి అనువదించిన గెంజిగాథను తెలుగులోనికి పరివర్తింపజేసిన డా॥ పండురి రామకృష్ణమాచార్య రచన, అజంతా పబ్లికేషన్స్, సికింద్రాబాద్ వారు ప్రచురించారు. వెల అయిదు రూపాయలు.

# లోకం తీరు

శ్రీ బలివాడ కాంతారావు

చిట్టిబాబు! గురించి ఆ పట్నంలో యెవరికి తెలీదు? అతనికీర్తి వూరంతా వ్యాపింపజేసిన వారిలో ముఖ్యులు—ఆఫీసులో అతని క్రిందనున్న గుమాస్తాలు, బంట్రోతులు. ఇంట్లోనువున్న యేడాదికి పదిసార్లు మారిన పనిమనుషులు.

చిట్టిబాబు నవ్వడు—నిజమే! ఏ నాడైనా పొరపాటున ఒక చిరునగవు ఓ లిప్తపాటున కనిపించిందంటే ఆవేళ వర్షం వస్తుందని గుమాస్తాలు అనుకుంటారు. మొగుడూ పెళ్ళాలు జగడమాడుకుంటారనీ, దానికి కారకుడు మొగుడేనని వూరంతా ఈ విషయం చాలా వూహించుకున్నారు. దానికి ప్రత్యక్ష నిదర్శనాలు చాలా వున్నాయి.

ఒకనాడు చిట్టిబాబు పెళ్ళాం మీనాక్షితో సహా బజారుకు వెళ్ళాడు. రోడ్డుమీదే పెళ్ళాంమీద కస్సుమంటున్న చిట్టిబాబును యెందరో ఆగి మరీ చూసారు. బుష్‌షర్టుకున్న చిరిగినజేబు ఆమె కుట్టడం మరిచిపోయింది చిల్లర డబ్బులు జారిపోయాయి. ఇంకోజేబులో వెయ్యలేక పోయారా అని ఆమె అన్నదని అసలు అక్కసు. 'జేబులు పరీక్ష చేసుకున్నా కుర్చోడానికి నీలాగ నాకు తీరుబడేదీ? ఇంట్లో దేనికున్నావ్ — తినడానికా?' ఇంకా కోపం వచ్చేస్తోంది కాని ఆమె మౌనంతో ఆతగాడు వూరుకున్నాడు.

ఇంకోనాడు - ఇంట్లో—ఉదయమే. అతగాడు భార్యను వేగంగా తయారవమన్నాడు. నిన్ననే చెప్పాలని మరచిపోయాడు. ఎవరో యింట్లో పెళ్ళి— వెళ్ళాలని ఆమె 'యింకా పిల్లలిద్దరూ లేవలేదు. నేనెలా రాగలను? మీరు వెళ్ళిరండి' అంది.

'వస్తావా? రావా?' అన్నాడు.

'ఎలా రమ్మంటారండీ? పిల్లలకు స్నానాలు అవీ చేయించి — అమ్మాయి పదిగంటలకే ఆకలికి యేడుస్తుంది.'

'ఏం...నా మాటంటే ఖాతరు లేదా?'

'అలా అన్నానండీ?...

ఇలా మాటా మాట పెరిగి 'విడాకులు తీసుకోవాలని వుందా?' అని యెగిరాడు. మీనాక్షి కళ్ళల్లో నీరు తెచ్చుకుని 'ఇంత పోషిస్తున్నారని—ఇంత మాటలు అనకండి'

'ఉద్యోగం చెయ్యలేక పోయానా?'

'అంతచదువు చదివించలేదు మావాళ్ళు'

ఇలా ముదిరినకోపం అతనిచే కేకలు వెయ్యించి పిల్లలను లేపింది, పనిమనుషులను వణికించింది. అతడు విడాకులు తీసుకోనున్నాడన్న వార్తమాత్రం బజారులో పడింది. ఆ రాత్రి తను పడగ్గదిలో పెళ్ళాన్ని బ్రతిమాలి మళ్ళీ యెప్పుడూ యింక పెద్దమాటలు ఆడనని చేసుకున్న ఒట్టువిషయం వాళ్ళిద్దరికి తప్పించి యింకెవరికీ తెలీదు.

ఎవరైనా అడుక్కోడానికివస్తే మీనాక్షి బిచ్చం వెయ్యబోతే 'వెధవ పోతులా వున్నాడు బిచ్చంవేసి వాణ్ణెందుకు పాడుచేస్తావ్' అని బిచ్చంవెయ్యకుండా చేసేవాడు. వాడు 'ఆ అమ్మ మంచిదే. బిచ్చం వెయ్యడానికొస్తే ఆ బాబు కానిచ్చాడుకాదని' చాటేవాడు. రోడ్డువార అరచుకుంటున్న గ్రుడ్డివాడికి చీకట్లో జేబులోవున్న చిల్లరడబ్బులంతా చిట్టిబాబు వెయ్యటం యెవరు చూసారు?

ఆఫీసులో గుమాస్తాలమీద పులి. డైరీలో అంతా రాసుకుని! ఆ రోజు ఉదయమే గుమాస్తాల

మీద సవారీ 'అబ్బా! ఎంతా కరెక్టుగా టైములో అయిపోవాలి. వాడింట్లో పెళ్ళాన్నైనా రోజూ టైముకు భోజనం పెట్టుందా? చంపుకుతింటున్నాడు. ఎప్పుడు పోతాడో?' సంవత్సరం ఆఖరులో తన క్రిందవున్నవాళ్ళందరి పైమీద మంచి రిపోర్టులు రాసిన వైనం యెందరకు తెలుసు?

అంతా చిట్టిబాబుకోపం, పెళ్ళాంకు విడాకు లిస్తానని బెదిరింపులు, బిచ్చమయినా వెయ్యడానికి ఒప్పుకోని అతని పిసినారితనం, ఆఫీసులో గుమాస్తాల మీద పులిలా వురకటం, యిలాంటి అవలక్షణాల గురించి పొగరేగినట్లు చెప్పుకుంటున్న సమయంలో ఒక మంట లేచింది. అతనికి దయాదాక్షిణ్యాలు లేవని, ఉత్తకోపిష్టనీ, కట్టుకున్న పెళ్ళాంనూడా సహించలేని మాటలు విసిరి ఎదుటివాళ్ల మనస్సు నొప్పిస్తాడని, నవ్వనెరగడని, హాస్యానికి, పరిహాసానికి దూరంగా వుంటాడనీ......ఇలా యెన్నో విశేషణాలతో అతని గుణగణాలు చెప్పుకుంటున్న తరుణంలో ఈ ఘోరం జరిగిపోయింది

ఉదయమే—ఆ క్రిందటి రాత్రి మొగుడూ పెళ్ళాలు అన్యోన్యంగా ఒంటిగంట రాత్రివరకూ యెన్నో కబుర్లు చెప్పుకున్నారు. కొడుకూ, కూతురూ ఇద్దరూ కదలకుండా పడుకుని నిశ్శబ్దవలపు వాగ పోసుకోటానికి అవకాశం యిచ్చారు. తన కోపం పట్టింపుచేసుకోవద్దని జీవితంలో ఎలాంటి అర్ధాంగిని కాంక్షించానో అలాంటిదే దొరికిందనీ మళ్ళీ పొరపాటునైనా ఆమె మనసు నొప్పించనని చిట్టిబాబు పెళ్ళాంతో చెప్పుకున్నాడు. ఒక్కక్షణం పూల తోటలో వెన్నెల్లో విహరించారు. ఆమె అతని వక్షంపై తలపెట్టి ముద్దుపెట్టి రెండు చేతులతో అతని భుజాలను తాకుతూ 'జన్మజన్మలకు మీలాంటి భర్తే కావాలని' కోరుకుంది. ఇద్దరూ నవ్వుకున్నారు. మౌనంగా నిట్టూర్పులతో వలపుతేనియలు సృష్టించుకున్నారు. అదో స్వప్నవిహారమైం దానాడు.

ఆలస్యంగా లేచిందేమో—రాత్రి కట్టుకున్న నైలాన్ చీర మార్చుకుండానే వంట యింట్లో కాఫీకోసం స్టౌ వెలిగించడానికి మీనాక్షి వెళ్ళింది. కాఫీపొడుంకోసం తిరిగిందో లేదో గాలికి పమిట యెగిరి 'స్టౌ' మీద పడింది. చీరకు నిప్పంటుకుంది...వంట యింట్లో కేకలు విని చిట్టిబాబు పరుగెత్తాడు కళ్ళ యెదురుగానే ఆమె కాలిపోయింది. ఆసుపత్రిలో ఒక రోజంతా చావు బ్రతుకులమధ్య పెనుగులాడి ఒక్క క్షణంలో చావు తెలివి తెచ్చుకొని కన్ను మూసింది.

చిట్టిబాబు మూగపోయాడు. పిల్లలగోడు యింతా అంతా కాదు అమ్మ యేదంటే వస్తుందమ్మా అన్నాక యేడుపు ఆపుకోలేక పోయాడు. రెండో రోజు యింకా అమ్మా రాలేదేం అని కూతురు మారాం చేస్తోంది చంటివాడు చనుపాలుకు తహతహలాడి యిల్లు యెగరగొట్టున్నాడు. వచ్చేవాళ్ళు మితిలేక వస్తున్నట్లుంది వాళ్ళ ముఖభంగిమలు చిట్టిబాబుకు నచ్చలేదు ఒంటిగా గదిలో ఒకమూల తలుపులు లోపలించి గడియవేసుకుని కూర్చున్నాడు. ఎదురుగా నిలువుటద్దం అందులోనించి తన ప్రతిబింబం యెన్నెన్నో ప్రశ్నిస్తోంది. మీనాక్షి అమాయకత్వం, ఆమె ప్రేమ ఈ ప్రమాదానికి ముందు రాత్రి తనతో ఐక్యమై జన్మ జన్మలకు భర్తగా తనని కోరుకోవటం—ప్రేమలో సిగ్గు కలిపి విభుని మెల్లగా అతని అల్లుకొన్న మీనాక్షి, కరుకుతనం యెరగని యిల్లాలు—తన్ను వదలి బుగ్గయిపోయింది.

ఎందుకలా జరగాలి? తనలో యేదో లోటుందేమో? లోకం అంతా తనని చెడ్డవాడంది. తన కోపం, లోభం, తన విసుగు—

ఇలా సతమతమయ్యే రోజుల్లో ఒకనాడు వీధిలో గుసగుసలు విన్నాడు. తను వినటం పొరపాటేమో? మరుసటి రోజు కిళ్ళీ కొట్టు దగ్గర యిద్దరు తనను చూడకుండా తన భార్య చావు గురించి మాట్లాడుకుంటున్నారు ఇంకో రాత్రి రైల్లో ఒక మూల కూర్చుంటే ప్రయాణీకులు తన భార్య చావు గురించే వ్యాఖ్యానించుకుంటున్నారు. ఇంకో రోజు ఆఫీసులో గుమాస్తాలు తను గదిలో లేడనుకొని వాగారు. ఇలా వ్యాఖ్యానాలు బహుశః యీ వూర్లో ప్రతి యింటిలో జరిగి వుండాలి.

ఇంటికివచ్చి కూలబడ్డాడు. పడకగది తలుపులు వేసుకొని పెళ్ళి ఫోటో యెదురుగా నిల్చొని కన్నీరు తుడుచుకోకుండా 'చెప్పు విశాలాక్షి—లోకం అన్నట్లు నా బాధలు పడలేక నువ్వు ఆత్మహత్య చేసుకున్నావా?'

రెండు రోజులు యిల్లు కదల్లేదు. రాను రాను పిల్లలను చూస్తుంటే మనసు మహాసముద్రము పోతోంది. ఏడవలేడు. ఏడిస్తే ఓదార్చే వాళ్ళెవరూ లేరు. ఇంట్లో పిల్లలను చూడటానికి కష్టమయిపోయింది. నాది అని పిల్లలను చూసుకునే దగ్గర వాళ్ళెవరూ లేరు. ఉన్నవాళ్ళయినా నెల రోజాలుంటారు—రెండు నెలలుంటారు వాళ్ళ సంసారాలు వదులుకుని సంవత్సరాలు వుండగలరా!

చిట్టిబాబే వీలైనంతవరకూ యింట్లోవుండి పిల్లల సంరక్షణ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు తల్లిమీద బెంగతోపాటు పిల్లలకు యేవో రోగాలు. ప్రేమయిచ్చి సంరక్షణచేసి జబ్బు కుదిర్చేవాళ్ళెవరూ లేరు. ఒకనాటి రాత్రి తెగించి ఒక నిర్ణయానికి వచ్చేసాడు. తనకు పెళ్ళాంకంటె యీ పిల్లలకు తల్లికావాలి. అందుకే తన యింట్లో ఆడది వుండాలి. దగ్గరవాళ్ళే........ ఆ పిల్ల తనకు తెలుసు. నెమ్మదైనది. తన పిల్లలను జాగ్రత్తగా పెంచుతుందని ఆ పిల్ల తండ్రిని కలుసుకున్నాడు. సంశయిస్తూనే తన వుద్దేశం చెప్పాడు. అతను కళ్ళెర్రజేసి 'నాకూతురు బ్రతకటం నీకిష్టంలేదా?'... అన్నాడు.

'ఏం? అలా అంటున్నారు!'

'మొదటి పెళ్ళాం నీ పోరుపడలేక బలవంతాన నిప్పంటించుకొని చచ్చిందిగా?'......

'లేదు లేదని' అరిచాడు. 'నువ్వు లేదంటే నిజం దాగుతుందా?...' చిట్టిబాబు అతన్ని తోసివేసి బయటకువచ్చి స్కూటరు స్టార్టుచేసినప్పుడే చెయ్యి వణుకుతోంది. ఎదరగా రోడ్డు కనపడలేదు ఇంట్లో విశాలా తిరుగుతున్నట్లు ఆమెతో యేదో విన్నవించుకున్నట్లు భ్రమపడుతున్నాడు. 'చూడు మీనా...... లోకం నన్నెంత అపార్థం చేసుకుందో? నువ్వు మూడునెలలు మంచంపడితే నేను నీకన్ని సేవలూ చెయ్యలేదా? నివ్వేది కోరితే అది నే నివ్వలేదా? మనం కులాసాగా కబుర్లు చెప్పుకోలేదా? వెన్నెల్లో విహరించలేదా? జన్మజన్మలకూ నువ్వూ నేను భార్యాభర్తలుగా వుందామని అనుకోలేద? అలాంటి నిన్ను బలవంతంగా నేను చంపానా? ఈ లోకానికి నానించి నీవు చావలేదని ఎలా తెలుస్తుంది? యెవరుచెప్తారు? ఒక్కక్షణం బ్రతికివచ్చి చెప్పు విశాలా...... నీబదులు నేను చచ్చిపోతానులే.. ...అదిగో మీనా...అదిగో...'

చిట్టిబాబు స్కూటరు వడిగా పరిగెత్తుతోంది. అదిగో మీనా......చేతుల్లో బాబుని యెత్తుకుంది. యెదరగా వస్తోంది - ఇటు ప్రక్కనుంచి లారీ...... మధ్య చిక్కిపోయి చచ్చిపోతుంది... ... ఆమె చావడానికి వీల్లేదు - కొద్దిగా యెడమకు తిప్పాడు. అంత యెత్తునుంచి స్కూటరు ధభేలుమని ముప్పయి అడుగులు క్రిందకు దొర్లిపోయింది. బిడ్డను యెత్తుకున్న ఒక స్త్రీ చావు తప్పించుకొని గట్టిగా అరచి అక్కడే కూర్చుండి పోయింది. తల పగిలిన చిట్టిబాబు యింకా ఆసుపత్రిలో మూలుగుతున్నాడు. మీనా...నాగురించి నివ్వు చావలేదని లోకానికి చాటిచెప్పవూ?......ఆ మూలుగులోని అతని మాటలు యెవ్వరికీ అర్థంకాలేదు. అతను చచ్చిపోయాక అందరూ అన్నారు 'పెళ్ళాన్ని చంపినవాడికి యింతకంటె గొప్ప చావెలా వస్తుంది?'

# ఆహ్వానం

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

రా—

కొత్త భవిష్యత్తులోకి—
వెన్నెల మట్టిలోకి—
వికసించిన ఎర్రని వెలుగు నెమలి కన్నులు
దొరికే బాటకి, కవుల కల్పనావాటికి—

కోటి కోటి కంఠాల తీయగా పిలుచుకొని,
కోటానుకోటి చేతుల్ని ఆప్యాయంగా కలుపుకొని,
స్నేహ శ్రీగంధం పూసుకొని— రా—

విడని విచిత్ర రహస్యాల ముడులు విడిపోయి,
నీ నిర్నిద్ర చైతన్యగానం పుడమి అంచులు దాటిపోయి,
ఆకాశ ద్వీపానికి, జ్యోత్స్నా తీరానికి
చేరుతున్న కాలంలోకి—
సరికొత్త వలయంలోకి— రా—

ఈ మహావిశ్వకిర్మీరరథంమీద, నవ్యపథంమీద,
వక్రగతుల్లోకి లాగే వాజులు రోజుల
పగ్గాలు నీ గుప్పిటి బిగించి,
నీ కనుల తళుకు రెక్కల చూపు తరళించి,
ఇహలోక విరించీ— రా—

* * *

బల్లపరుపు భూమిలో బయలుదేరి
గోళపృథివిలోకి అడుగుపెట్టి,
నీ అడుగు అశ్వంమీద, ఆవిరిమీద, 'ఆయిల్' మీద
ఆగమేఘాలమీద గాలిపరుగులుపెట్టి

నిన్ను తెన్నుల్లో విహరిస్తోంది —
వేరొక మజిలీకి, నూత్న గమ్యానికి నడుస్తోంది—

*　　　　　　*　　　　　　*

అమృత మవనీ, హాలాహల మవనీ
కొత్తది ఏది కానీ
నీ చేయి ఆహ్వానించాలి—
హాలాహలం నుంచైనా అమృతాన్ని చిలికించాలి—
పచ్చని జగత్తు మొగంపై విద్యుత్తేజం తొణికించాలి—

ఇచ్ఛాదేవి వజ్రదీపం, నీకు త్రోవ చూపుతుంది,
ప్రజ్ఞానరాజ్ఞి క్షణాత్కంకణకరం నిన్ను తట్టిలేపుతుంది,
దారి విడుతుంది—

---



# రసజగత్తులో సామాన్యుడూ - సమీక్షకుడూ

శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

ఓ రసకృతిని ఆస్వాదించాలంటే ఆస్వాదయితకు హృదయగతమైన ఓ సంస్కారం ఉండాలి. దానిని 'వాసన' అని అనవచ్చు. ఇది రసాస్వాదనానికి ఓ ముఖ్యసాధన. ఈ వాసన అన్నది లేకపోతే ఆస్వాదయిత కమ్మని పదాలనుండీ, ముచ్చటైన మూర్తులనుండీ, రమణీయమైన రంగులనుండీ రసాన్ని ఆస్వాదించలేడు.

అందుకనే మీమాంసకులకూ, వ్యాకరణ పండితులకూ రసాస్వాదనము కలుగదు, అని ఆనంద వర్ధనాచార్యుడు అన్నాడు.

ఈ అభిప్రాయాన్నే ధర్మదత్తుడు ఇలా చెప్పాడు.

'స వాసనానాం సభ్యానాం రసస్యాఽస్వాదనం భవేత్
నిర్వాసనాంతరంగాస్తు కాష్ఠకుడ్యాశ్మ సన్నిభాః.'

'వాసన' కలిగినవారే రసాన్ని ఆస్వాదించగలరు. అలా 'వాసన' అన్నది లేనివారు నాటకమూ మొదలైన వాటిని చూచుచున్ననూ, రసాన్ని ఆస్వాదించలేక రంగస్థలమందున్న స్తంభములవలెనూ, గోడలవలెనూ, రాళ్లవలెనూ ఉండిపోతారు.

ఈ భావాన్ని పరిశీలిస్తే, ధర్మదత్తుడు ఎంత చక్కగా చెప్పాడూ, అని అనిపిస్తుంది.

ఎందుకంటే సామాన్యుడినీ సమీక్షకుడినీ ప్రక్క ప్రక్కల ఉంచి పరిశీలిస్తే కనబడే సత్యమే ఇది

అసలు విమర్శకు అలవాటుపడితే రసాస్వాదనకు పరిశీలనాదృష్టి అడ్డొచ్చి రసతత్వంనుండి పొంగి పొరలే భావమాధురిలో తాదాత్మ్యతను పొందటం చాలావరకు అంతరిస్తుంది. ఎందుకంటే సమీక్ష ఎంతవరకూ పరిశీలనలో పోతూ, పరిశోధనకొరకు వెదుకుతూ, ఎప్పుడూ దార్శనికభావాలలో విహరిస్తూ ఉంటుంది. కనుకే రససమీక్షకుడు కమ్మని రసకృతులనుండి పారవశ్యాన్ని పొంది అందులో కరిగి తాదాత్మ్యతను సామాన్యునివలె పొందలేడు. అందుకే రమణీయతకూ తాదాత్మ్యతకూ మధ్య కొన్ని పారదర్శకమైన పొరలు ఏర్పడుతున్నాయి రససమీక్షకునిలో.

ఇక సామాన్యునిలో అంటారా! కళకూ తాదాత్మ్యతకూ మధ్య సమీక్షా, పరిశీలనా ఉండదు. కనుక అతను రసకృతిని చూచీచూడటంతోనే కరిగిపోయి రసకృతిలోని భావమాధురిలో తాదాత్మ్యతను పొంది తన్ను తాను మరచిపోగలడు ఇది సామాన్యుని స్థితి.

పోతే, సమీక్షకుడు రసకృతిలో ఎప్పుడు లీనమౌతాడంటే ; అతను ఆ రసకృతిలోని నిర్మాణ స్థాయినీ, రసస్థాయినీ చూచినప్పుడు, ఆ రసకృతిలో విలీనమై, అందులో తాదాత్మ్యతను పొందుతాడు. అప్పుడు ఆ రసకృతిలోని రసానందాన్ని పతాకస్థాయిలో అందుకుంటాడు అందుకనే సమీక్షకుడు తన హృదయాన్ని కొంచెం కఠినం చేసుకొని రసకృతులను సమీక్షించి వాని లోతులను చూస్తారు.

ఆ స్థితి సామాన్యునికి ఉండదు. కనుక అతని హృదయం సమీక్షకునివలె రసతత్వంలోని

లోతులను చూడక, కళయొక్క బాహ్యస్వరూప మాధుర్యానికే ద్రవించి పొంగిపోతుంది.

కనుక సామాన్యుడు రసకృతుల బాహ్య స్వరూపానికీ, దాని రమణీయపారవశ్యానికీ ద్రవించి పోయి, తనను తాను మరిచిపోతుంటే ; సమీక్షకుడు అప్పుడు తనే హృదయమార్దవాన్ని కోల్పోయి పరిశీలనలో ఉంటాడు.

సమీక్షకుడు రసకృతులలో అంతర్లీనంగా ఉన్న సృజనశీలతకూ, రచనాచమత్కారానికీ, రస పోషణకూ, నిర్మాణస్థాయికీ ద్రవించిపోతుంటే ; సామాన్యుడు వానిజోలికి పోడు

ఐతే ఇక్కడ ఓ చిన్న అంశం దాగిఉంది. ఎప్పుడైతే కళాసమీక్షకుడు తాను కళలో వెతికి వెలికి తీసిన అంశాలు ఎలా రసతాదాత్మ్యతకు తోడ్పడు తున్నవో, అనే విషయాన్ని సామాన్యునికి చెబుతూ, వాటిని సామాన్యుని ముందుంచుతుంటే ; అప్పుడు సామాన్యుని దృష్టికి, ఆ కళాసమీక్షకుడు ఆ రస కృతిలో ఎంతగానో విలీనమై బాగా తాదాత్మ్యతను పొంది ఈ నూతన అంశాలను చెబుతున్నాడని అనిపిస్తుంది. అందుకని సమీక్షకుడు తనకన్నా ఎంతో ద్రవీకరణశక్తి కలవాడని అనుకొంటాడు సామాన్యుడు.

అంతమాత్రంతో రససమీక్షకుడు ద్రవీకరణ శక్తి లేనివాడని కాదు !

కాకపోతే అతని ద్రవీకరణలో మార్దవము కొంచెం లోపిస్తుంది. అందుకనే అతను రసకృతుల బాహ్యస్వరూపాన్ని దాటి వాని అంతరాంతరాళాల లోనికి పోయి కొన్ని క్రొత్త అంశాలను తీసుకొచ్చి సామాన్యునిముందు ఉంచగలుగుతున్నాడు.

కనుక సామాన్యుని ద్రవీకరణ కళాబాహ్య స్వరూప రమణీయతలమీద ఆధారపడితే ; సమీక్ష కుని ద్రవీకరణ, కళలో అంతర్నిహితమై ఉన్న రస సారూప్యాలమీదా, రమణీయ రచనా చమత్కారం మీదా ఆధారపడి ఉంటుంది.

ఇలా ఉంటాయి సమీక్షకునీ సామాన్యునీ హృదయగతస్థితిగతులు. అసలు ఆలోచిస్తే, ఈ విభిన్నతకు కళలోఉండే మరికొన్ని స్వరూపాలు కారణమేమో, అనికూడా అనిపిస్తూ ఉంటుంది.

అందుకే ఈ స్థితి నేపథ్యంలోనుంచి మరి కొన్ని అంశాలు తొంగిచూస్తున్నాయి.

* * *

అసలు కళకు రెండు స్వరూపా లున్నాయి.

అందంకొరకూ కమనీయతకొరకూ పాటుపడే కళాంశాల స్వరూపం ఒకటి. దీన్నే కళయొక్క భౌతిక స్వరూపంగా చెప్పుకోవచ్చు

అలా కాకుండా పరిశోధనల రూపంలోఉండి, కళయొక్క నిర్మాణస్థాయిని పెంచే కళాస్వరూపం మరొకటి. ఇది కళలో అంతర్లీనంగా ఉండే ఆత్మ స్వరూపంగా చెప్పుకోవచ్చు.

పోతే కళలోని సాధారణ భౌతిక స్వరూపం వలన సామాన్యమానవునికి ఆనందమూ అనుభూతీ కలుగుతూ ఉంటుంది. దీన్ని గ్రహించటమూ, లేక పొందటమూ ఎంతో తేలిక. అందుచేనే ఇది మనిషిలో ఆవేదనలనూ, ఆలోచనలనూ, ప్రేరణలనూ అంతగా జనింపజేయక ; కేవలం ఆనందాన్నే కలిగిస్తూ, ఆ పరిధిలోనే అతన్ని నడిపిస్తూఉంటుంది. పైగా ఇది అతని భౌతికభావాలకు తోడ్పడేదిగా కూడా ఉంటుంది. అలా ఉన్నప్పుడు కళాస్వరూపం ఉపయో గంలో మిళితమైంది అని అంటాం.

రెండవ స్వరూపమైన కళయొక్క ఆత్మ స్వరూపం, మానవుని మేధాశక్తినీ, పరిశీలనాశక్తినీ పరిశీలించేదిగా ఉంటూ ; అతని మానసిక పురోగమ నానికి తోడ్పడేదిగానూ ఉంటుంది. ఇది అతని భౌతిక సుఖానికి కాస్త దూరంగా ఉంటుంది. కనుక దీని స్వరూపం కొంత జటిలంగా ఉండి సామాన్యునికి ఉపయోగపడేదిగా ఉండదు.

అందుకే కళయొక్క బాహ్య సౌందర్య స్వరూపం ప్రజలను ఆకర్షించేదిగా, వారికి ఉప యోగపడేదిగా ఉంటే; కళలో అంతర్లీనంగాఉన్న

ఆత్మసౌందర్యం పరిశోధకులనూ, రససమీక్షకులనూ ఆకర్షించేదిగా ఉంటూ, కళలోని సృజనశీలతను కలకాలం కాపాడేదిగా, దాని ప్రమాణాలు పెరగటానికి తోడ్పడేదిగా ఉంటోంది.

కనుక భౌతిక స్వరూపం లేకపోతే కళకు అస్తిత్వం లేదు. ఆత్మస్వరూపం (రసపరిశోధన) లేకపోతే కళకు జీవం లేదు.

అందుకనే ఈ రెండూ కళకు బాహ్య అంతః స్వరూపాలు. కాకపోతే భౌతిక స్వరూపం ముందుగా సమాజాన్ని ఆకర్షిస్తుంది. ఆ తరువాత కళలోని ఆత్మస్వరూపమైన పరిశోధన కళలో అంతర్లీనంగా ప్రవహిస్తూ, ఆ కళ అస్తిత్వంద్వారా వ్యక్తమౌతూ, వ్యాప్తమౌతూ, ప్రజలను ఆకర్షిస్తూ ఉంటుంది.

కొంచెం ఆలోచిస్తే, కళలోని ఆత్మస్వరూపమైన పరిశోధనే ముందుగా జనిస్తుంది. ఆ తరువాతగాని భౌతికరూపం కళలో రూపొందదు.

కనుక కళలోని భౌతికస్వరూపం త్వరిత గతిని ముందుకుపోదు. ఆత్మస్వరూపం ఎంతోవేగంగా పరిణామాలను పొందుతూ ముందుకు పోతూ ఉంటుంది. మొదటి దానికి సామాన్యుల ఆకర్షణ ప్రమాణం. రెండవదానికి రసస్రష్టల రసజ్ఞతా, రసప్రమాణాలూ ప్రమాణం.

భౌతిక స్వరూపం క్రొత్త క్రొత్త ప్రయోగాలను ఎంతవేగంగా కోరదు. ఆత్మస్వరూపం ఎంతో వేగంగా ఉన్నతస్థాయిలోని ప్రమాణాలనూ ప్రయోగాలనూ కోరుతుంది.

కనుక కళ భౌతికస్వరూపం సామాన్యునికి అందుబాటులో ఉండి అతనికి ఆనందదాయకమైతే; ఆత్మస్వరూపమైన రసపరిశోధన రససమీక్షకునికి సాన్నిహిత్యంలో ఉండి అతనికి ముదావహమౌతోంది

అందుకనే కళలోని ఆత్మస్వరూపం సామాన్యునికి సుదూరం. రసపరిశోధకునకు భౌతిక స్వరూపం కొంత దూరం.

ఈ రెండు స్వరూపాలూ ఇలా రసతత్వం లోనే ఇమిడి ఉన్నాయి. కనుకే సామాన్యుడినీ రసజ్ఞుడినీ తనలో కలుపుకొంటోంది రసతత్వం. కాకపోతే రస తత్వం నుండి ఎవరికి కావలసిన రూపాలను వారు తీసుకొంటున్నారు. తానూ ఎవరికి కావలసిన రూపాలను వారికి ప్రసాదిస్తోంది. కనుకే రసతత్వానికి ఈ రెండు స్వరూపాలూ ఎంతో అవసరం. ఇందులో ఏది లోపించినా కళ స్తంభించి పోతుంది.

ఇది అంతా రసతత్వంయొక్క పూర్ణ స్వరూపంలో ఓ అంశం.

* * *

ఇలాంటి స్వరూపంకల రసజగత్తులో కళ కళ కొరకా లేక సమాజం కొరకా అని అంటే!

పరిశోధనాత్మకమైన కళ ప్రజలకు ఉపయోగించదు సమాజదృష్టిలో. ప్రజోపయోగమైన కళ పరిశోధనకు పనికిరాదు రసజ్ఞుల దృష్టిలో.

సమాజ పరమయ్యే కళాంశమే పరిశోధనలో ప్రవేశించాలి; సమాజపరం అవటానికి వీలులేని కళాంశం పరిశోధనలో ప్రవేశించటానికి వీలులేదు సమాజ దృష్టిలో.

అందుకే సమాజానికీ కళకూగల సంబంధాన్ని గురించి నిర్ణీత నిర్వచనాలను ఇవ్వలేం. ఓ వేళ ఇచ్చినా అవి కొంతవరకే ఔతాయి

కనుక ఈ అనిశ్చితతను అలా ఉంచి కళ కళ కొరకా, లేక సమాజంకొరకా అనే అంశాన్ని వ్యావహారికంగా పరిశీలిస్తే, ఈ రెంటిమధ్యా దాగిఉన్న మరో సత్యస్వరూపం లీలగా గోచరించకపోదు పరిశీలకులకు.

మానవునిలో మొదటగా బయలుదేరేది జిజ్ఞాసతో కూడిన కళ. ఆ తరువాత అది తన స్వరూపాన్ని కొంత మార్చుకొని ఉపయోగపడేదిగా బయట పడుతుంది. దీన్ని వినిమయకళ అని అనవచ్చు సమాజ దృష్టిలో. ఆ తరువాత ఆ వినిమయకళ పాతదై పరిశోధనకళ పొందే పరిణామాలకొరకు ఎదురు

చూస్తూవుంటుంది. అప్పుడు పరిశోధన కళ తనలోని కొన్ని అంశాలను వినిమయ కళకు అందిస్తూ ఉంటుంది. అంటే వినిమయకళ నేడులో జీవిస్తూ ఉంటే; పరిశోధనకళ రేపులో జీవిస్తూ ఉంటుంది.

కనుక పరిశోధనకళ ముందు పోతూఉంటే; వినిమయ కళ దాన్ని అనుసరిస్తూ కొంత వ్యక్తిత్వాన్ని తాను పుంజుకొని ముందుకు ప్రయాణిస్తూ ఉంటుంది.

ఇంకొంచెం ముందుకుపోయి పరిశీలిస్తే—

సమాజ బాహ్యదృష్టిలో వినిమయకళ ముందు నడుస్తూ, పరిశోధనకళ దాన్ని అనుసరిస్తూ ఉందా అని అనిపిస్తుంది. కానీ యథార్థంలో పరిశోధనకళే ముందు పోతూఉంటే; వినిమయకళ దాన్ని అనుసరిస్తూ వుంటుంది.

కాకపోతే వినిమయకళ ఎంతో వేగంగా ప్రజలలోకి పోతుంది. ఆ తరువాతకానీ పరిశోధనకళ నాడి మెదడులలోకి ఎక్కదు. కనుకే పరిశోధనకళ సర్వకాలీనమూ, వినిమయకళ సమకాలీనమూ ఔతోంది.

అందుకనే, వినిమయకళ ఉపయోగంలో కాస్త ముందుగా ఉంటుంది. ఆ తరువాత నిలకడ మీదగానీ పరిశోధనకళ యొక్క ఉపయోగం తెలీదు సమాజానికి

మొత్తానికి ఈ రెండూ ప్రజల ఉపయోగాన్ని దృష్టిలో ఉంచుకొనే సాగిపోతూ ఉన్నాయి. కాకపోతే ఒకటి ముందూ మరొకటి వెనకా!

ఒకటి మానవుని భౌతికం మీదా, వర్తమానం మీదా ఆధారపడితే; మరొకటి అతని హృదయం మీదా భవిష్యత్తుమీదా ఆధారపడి ఉంటుంది.

ఒకటి వాస్తవంలో ప్రయాణిస్తూ ఉంటే; మరొకటి సృజనశక్తిలో ప్రయాణిస్తూ ఉంటుంది.

కనుక ఇవి ఒక దానికి మరొకటి ఆధారమై ఉన్నాయి. అందుకే ఇవి రెండూ పోష్యపోషక సంబంధాన్ని కలిగి ఉన్నాయి.

ఏది ఎలా ఉన్నా ఈ రెంటి ధ్యేయమూ మానవుని ఉపయోగమే.

కాకపోతే ఒకటి వస్తుగతంగా కనిపిస్తే; మరొకటి వస్తురతంగా కనిపిస్తుంది.

* * *

ఇలా కళాస్వరూపం ఉండబట్టే, రసగ్రహణలో సామాన్యుడు కళాస్వాదయిని కళాకోణాన్ని కోల్పోతున్నాడు. సమీక్షకుడు తన వ్యక్తిగత మార్దవాన్ని కోల్పోతున్నాడు.

ఎందుకంటే, సర్వసాధారణంగా సామాన్యుని బుద్ధిలో సౌందర్యతృష్ణకు బదులు ఉపయోగదృష్టి అధికంగా తొంగిచూస్తూ ఉంటుంది. అది తప్పని కాదు! కాకపోతే ఆ దృష్టి ఎక్కువైనకొద్దీ రసతత్వాల నిర్మాణాత్మకంగా ఉండక నిర్మూలనాత్మకంగా ఉంటుంది. అలాగే సమీక్షకునిలో దార్శనిక తత్వం ఎక్కువైనప్పుడు [illegible] నిర్మాణాత్మకంగా ఉండక నిర్మూలనాత్మకంగా ఉంటుంది.

కనుక కళలోని రసస్వరూపాన్ని యథాతథంగా దర్శించటానికి సామాన్యుడూ కళాంతరాంతరాలలో కొంతదూరమైనా రసాత్మకంగా సాగిపోయి, ఆ కళలో తాదాత్మ్యమును పొందాలి. సమీక్షకుడూ తన సమీక్షలో రసతత్వాన్ని విస్మరించకుండా, తన హృదయమార్దవాన్ని కోల్పోకుండా చూసుకోవాలి.

అప్పుడే రసతాదాత్మ్యంలో సామాన్యుడూ, సమీక్షకుడూ వేరోభాగం పొందగలరూ, రసతత్వంలో ఏకత్వాన్ని చూడగలరూ.

అంటే సామాన్యునిలో రససమీక్షా, రసదృష్టీ ఉండాలి. సమీక్షకునిలోనూ హృదయమార్దవమూ రసార్ద్రతా ఉండాలి. అలా ఉన్నప్పుడే కళ ఇటు సమాజపరమూ అటు పరిశోధనపరమూ ఔతూ పురోగమిస్తుంది. ఆ పురోగమనము సమాజానికి ముదావహమూ ఔతుంది.

అప్పుడు కళాస్వరూపం ఆనందప్రదంగానూ, ఆరోగ్యప్రదంగానూ ఉండి; ఇటు సామాన్యులకూ, అటు సమీక్షకులకూ శ్రేయంగానూ, ప్రేయంగానూ ఉంటుంది. అది సమాజానికీ, రసతత్వానికీ క్షేమకరమూ ఔతుంది !!!

## కలగూరగంప:

# అక్కరజాతుల గణములు - పరిశోధకుల పంతవాదములు

పాల్కురికి సోమనాథుడు తన ద్విపదలలో గగమును సూర్యగణముగా వాడిన తావులు కలవు.

'పాయక శ్రుతి రసాన్ భక్తస్య జిహ్వా,
గ్రేయని యే ప్రొద్దు ప్రయోగింగా వునను'

ఇత్యాదులు

కొందరు వీనిని గణభంగములని శంకించినారు. 'వాసవుల్ ముప్పురు వనజాప్తుడొండు భాసిల్లు నదియొక్క పదము' అన్న చిన్నన్న కొలబద్దతో ప్రాచీన ప్రయోగములను కొలిచినారు. 'భక్తజిహ్వాగ్రే'—అని ఉన్నచో సరిపడునన్నారు మగణస గురువులు ఇంద్రగణములలోను గగ స గణములు ఇనగణములలోను, ప్రాచీన కాలముతో ఉండెడివి ప్రాచీన శాసనములలోను నన్నయ అక్కరలలోను ఈ గణము లున్నవి. ద్విపద అక్కరజాతికి చెందినది కనుక సోమనాథుని ప్రయోగాలను చిన్నన్న కొలబద్దతో కొలవకూడదు ఈ విషయమును సోపపత్తికముగా 'భాగవతకవులు శివకవుల కోవకు చెందినవారే—' అను వ్యాసములో నిరూపించినాను. శ్రీ పిచ్చయ్య శాస్త్రిగారీ విషయము నంగీకరింపక 'భాగవత పాఠ పరిశోధనము' అను గ్రంథములో సమాధానమని కొంత వ్రాసినారు. శ్రీ సంపత్కుమారాచార్యులవారు తమ 'తెలుంగు ఛందో వికాసము'లో వ్రాసిన వాక్యములను చూపినారు. 'జిహ్వాగ్రే-అనుచోట పాదాంతమందలి 'హ్వా'- యనుగురువు వలన ఛందోభంగము కలుగుచున్నది' ఇట్లు 'ఆచార్యులవారును, గణభంగము కలిగినట్లే వ్రాసినారు గావున శాస్త్రిగారి శంక (శాస్త్రిగారు=ప్రభాకరశాస్త్రిగారు) ఆక్షేపణీయముకాదు' అన్నారు నా అభిప్రాయమునకు ప్రమాణములుగా చూపిన లక్షణ పద్యముల పూర్వార్ధముల నుదాహరించి నేను పద్యముల భావము తెలిసికొనక అధిక్షేపించినానని అరోపించినారు. సోమనాథుడు లక్షణమునకు విరుద్ధముగా 'గగ'మును వాడినాడని, అది అతని పద్ధతి యని చెప్పినారు

అసలు, జరిగినదేమనగా శివకవులు చేతికి వచ్చినట్లు వ్రాయుదురని పరిష్కర్తలు చేతికి వచ్చినట్లెల్ల వ్రాసినారు అపోహలతో నూతన వాదములు లేవదీయుటయో ముందుగా ఒక నిర్ణయము చేసికొని, దానిని సరిపెట్టుటకు సపత్తులు వెదకుటయో పరిష్కర్తలు తరుణోపాయములుగా పెట్టుకొన్నారు. అవి శ్రీ శాస్త్రిగారిపై బాగుగా పనిచేసినవి.

లక్షణవిరుద్ధప్రయోగములు చేయుట తన పద్ధతి యనువారికి సోమనాథు డిచ్చుచున్న సమాధాన మిదిగో—

'వైకల్యమత్యుక్తి వైరిపదంబు
ద్రాబ ఛందోవిరుద్ధంబాది యగు న
లాభ ప్రలాపోక్తి లాఘవంబనక
పసిగూర్పు కృతులునా వడ్లను బెరుగు
పిసుకు చందపు బిలిబిలికృతుల్ కృతులె'

(కుకవినింద)

ఇప్పుడు, సోమనాథుడు లక్షణవిరుద్ధప్రయోగములు చేయునన్న వ్రాతకర్థమేమి? సోమనాథుని కృతులు వడ్లనుబెరుగు పిసుకుచందపు బిలిబిలి కృతులు; 'తెలుంగుమాట లనంగవలదు వేద

ముల, కొలఁదియగా చూడుడు' అని ఆయన చెప్ప కొన్న మాటలు, అలాభ్రపలాపోక్తులు; ఆయన కుకవి. శాంతం పాపమ్.

ఇక, గణభంగములు 'చాటలో వెలక్కాయల వలె స్పష్టముగా కనబడుచున్న'వని శ్రీ శాస్త్రిగారనకపోరు. లేని వైరిపదములను వెలగకాయల వలె కనబరిచిన మనస్సు లేని గణభంగములను తాటికాయలవలె కనబరిచినను వింత లేదుగదా !

ఇంతకు, శ్రీ సంపత్కుమారాచార్యులుగారి వాక్యముల నాధారములుగా పేర్కొన్నారుగనుక నే నుదాహరించినవి, శ్రీ శాస్త్రిగారు పూర్తిగా ఉదాహరింపక, నాకు తెలియక అధిక్షేపించినానని చెప్పినవి — అగు, లక్షణపద్యముల భావమేమో శ్రీ ఆచార్యులుగారి వాక్యములలోనే చూపుదును

వినుత ద్విత్రి చతుర్గురు
జనిత గణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
చను నక్కర జాతులకె
ల్లను నాదిమ లఘువు మొదల లఘు
విడవలయున్'
(కవిజనాశ్రయము)

ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల
నైనగణము లినసురాధిపేంద్ర
గణము లక్షరోపకరణంబులవి యాది
లఘుగణంబు మొదల లఘువు నిలుప'
(కావ్యాలంకార చూడామణి)

'ఈ రెండు స్థలములందుగూడ రెండు మూడు నాల్గు గురువులవలన జనించిన గణములందు ఏవో కొన్ని గణములను తొలగించుట యన్నది అనంతుని పద్యమందువలె కానరాదు. అనఁగా అనంతాదుల మతమున సూర్యగణములలో, గగ, సగణములు, ఇంద్రగణములలో మ — సగ గణములు, చంద్రగణములలో, మగ — సగగ గణములు ఉండవు. కవిజనాశ్రయ కా. చూడామణికర్తల మతమున ఉండును. కవిజనాశ్రయమందు ఈ సూర్యేంద్ర చంద్రగణములు, అక్షరజాతులకెల్లను ఉపయోగించవలెనని, 'వినుత ద్విత్రి చతుర్గురు' అను పూర్వోదాహృత పద్యమున చెప్పబడినది. కా. చూడామణి యందు, ఈ సూర్యేంద్రచంద్రగణములు 'అక్షరోపకరణంబులు' అని పూర్వోదాహృత పద్యమున చెప్పబడినది అక్కర అనుదానికి అక్షర సంస్కృతీకరణము. (జయకీర్తి అక్కరలను అక్షర అని పేర్కొని నాడు - ఫుట్‌నోటు) అక్కరలకు ఉపయోగించునవి అనగా అక్కరజాతులకు అనియే కవిజనాశ్రయమందు చెప్పబడినట్లు భావించవలసియుండును. అయిదు విధములయిన అక్కరలు, ద్విపద, త్రిపద, షట్పద అనునవి అక్కరజాతిపద్యములుగా చెప్పవచ్చును ఎందుకనగా ఈ పద్యముల లక్షణములను చెప్పునప్పుడు మాత్రమే సూర్య ఇంద్ర - చంద్ర అను పేర్లను పేర్కొన్నారు సీసగీతాదులకు సూర్యేంద్ర చంద్రగణములను చెప్పక విడిగా గణములను (నల నామగణములు, నగణము - లేదా హగణము) తత్కర్తలా పేర్కొన్నారు.' దేశీయ గణములు : లాక్షణిక మత భేదము — అను వ్యాసమునుండి యీ వాక్యములు చూపబడినవి శ్రీ ఆచార్యులుగారి యీ వ్యాసము 1963 నవంబరు సాహితిలో ప్రకటితము. అంతకు పూర్వము శ్రీ ఆచార్యులుగారు తమ తెలుగు ఛందో వికాస గ్రంథమున సోమనాథుడు గణభంగము చేసెనని వ్రాసినారు. ఈ ప్రమాదము పరిష్కర్తలను నమ్ముటమూలమున తటస్థించినదే శ్రీ శాస్త్రిగారు దీని విషయ మెత్తుకొనక ఛందోవికాస గ్రంథములో తమ కనుకూలముగ వ్రాసిన వాక్యములను తెచ్చి సమర్థించుకొన యత్నించినారు. లక్షణకర్తల పద్యములను సగమువరకుదాహరించి సత్యమును కప్పిపుచ్చినారు. ఆ లక్షణపద్యముల భావమేమో నేను తెలిసికొనకుండ పరిష్కర్తల నధిక్షేపించినానని వెలవిచ్చినారు ఆ లక్షణపద్యముల భావము నేను చెప్పినదే కాని వేరుకాదని శ్రీ ఆచార్యులుగారి వాక్యములను బట్టి విస్పష్టమగుచున్నదిగదా ఇంతేకాక, నన్నయ అక్కరలలోని కొన్ని గణములు పై ప్రాచీన

లక్షణానుసారముగనే ఉన్నవని శ్రీ ఆచార్యులు గారును చెప్పినారు. వేయేల! 'సోమనాథుని ద్విపదలను అనంతాదుల దృష్ట్యాకాక, కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణుల దృష్ట్యా చూడవలెను అప్పుడాతావుల గణభంగము జరుగలేదని చెప్పవచ్చును' అని నిర్ణయించినారు సత్యమిట్లుండగా ఛందోరీతులలో వ్రాసిన వాక్యములనుతెచ్చి 1926 నాటి తప్పుడు నిర్ణయమును నిలబెట్టుటకు పడరానిపాట్లు పడుటలోని అంతర్యమును నిపుణమతులు గుర్తింపగలరు

ప్రాచీన గ్రాంథిక ప్రయోగ నిర్ణయమున, కొన్ని నిబంధనములు పాటించుట కర్తవ్యము లేని నాడు మన పరిశోధన అపకారకమే కాగలదు ప్రాచీన భాషకు మన నాలుక, మనచెవి, మన గ్రామ్య ప్రియత్వము, కొలగజ్జిలుగా పెట్టుకొనరాదు. యతి ప్రాసాది గత ప్రయోగములను, అప్రమాణములనియు, లేఖకుల వ్రాతతప్పులు కవుల అసలు పాఠములనియు చెప్పరాదు. ప్రాచీన కవులిట్లు ప్రయోగింపరు – అని యే బాలవ్యాకరణమునో ప్రమాణీకరించునప్పుడు, ఆ నవీనలక్షణగ్రంథసూత్రము ప్రాచీనభాషానుకూలమా? కాదా? అన్నది చూచుకొనవలెను. విశ్వసనీయములగు మహాకవుల ప్రయోగములనుబట్టి లక్షణ సూత్రములను మార్చుకొనవలసినదే కాని, 'ఎవరికివారే యమునాతీరే' అని అనుకొనరాదు సంస్కృతలక్షణమునకు భిన్నముగా ఒక మహాకవి ప్రయోగమున్నప్పుడు సింహతస్యగతిశ్చింతనీయా – అను పద్ధతి నవలంబింపవలెను. కవి యేర్పరుచుకొన్న నియమమునకు భిన్నముగా పాఠము లేర్పడియున్నచో, కవిప్రయోగమని విశ్వసింపదగినట్లు కవిపాఠమును నిర్ణయింపవలెను. తమకు కవిపాఠము అందనిచో ఋజువుగా ప్రవర్తింపవలెను. అభిమానమునకు పోయి కవి అభిప్రాయమునకు విరుద్ధములగు నిర్ణయములు చేసి ఇదంతయు పరిశోధనమన్న భ్రాంతిని లోకమునకు కలిగింపరాదు అట్టి భ్రాంతికి లోనయినవారు కవి ఆశయము తెలియగానే తమ అభిప్రాయములు మార్చుకొనవలెను. అజ్ఞకవిప్రయోగముల వంటివే మహాకవిప్రయోగము లనుకొనరాదు. మహాకవి ప్రయోగములయందలి ప్రయోగ సూక్ష్మతను గమనించుట కర్తవ్యము. భాషారాధనతత్పరులయిన పెద్దలవలననే భాషకు అపకారము తటస్థించిన ఏమనవలె? 'కంచెయే చేనుమేసె నాక్షణము [illegible]నందు'.

ప్రాచీనమతమున, అక్కరజాతులలో ఉపయోగించు ఇంద్రగణములలో మగణ సగురువులును, ఇనగణములలో గగ, సగణములును ఉండెడివి. అర్వాచీన లక్షణగ్రంథములు ప్రాచీనమతమునకు విరుద్ధముగ ఉన్నవి. 'అనంతాదులకన్న పూర్వపు రచనలను కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణి కర్తల మతము ననుసరించి చూడవలెనుగని అర్వాచీనులగు అనంతాదుల మతమునుబట్టి చూడరాదు' అని శ్రీ ఆచార్యులుగారే నిర్ణయించినారు. పరిష్కర్తల నిర్ణయములన్నియు, ఇట్లే వట్టి అపరిశీలనమూలకములు, గ్రంథకర్త ఆశయమునకు కేవలము విరుద్ధములు అనుటకు సందేహ మేమియులేదు. వారి వ్రాతలను ఎట్లయిన నిలబెట్టుటకు ఏవోవో యుక్తులు పన్నుట యెందుకో విచక్షణులకు విదితమే. ఇట్టి స్థితిలో అకాడమివారు పాఠనిర్ణయములను చేయించు ప్రయత్నము పెట్టుకొనుటకంటె ఉపలబ్ధములయిన పాఠభేదములను ప్రకటించుట శ్రేయస్కరము.

—శ్రీ వంతరాం రామకృష్ణరావు.

# కవిగా వేలూరి శివరామశాస్త్రి

ఆధునికాంధ్ర కవిత్వాన్ని భావకవిత్వయుగమని, అభ్యుదయకవిత్వయుగమని విభజించటంవలన, వీటికి చెందక, సంఘపరిశీలకుడుగా వుంటూ ఏవిధమైన సిద్ధాంతసులోచనములు తగిలించుకొనక, తన జీవితానుభవము ఆధారంగా కవిత అల్లిన కవులు కనుమరుగై పోయారు ఆ విధంగా మరుగునపడిన కవిరత్నములలో స్వర్గీయ వేలూరి శివరామశాస్త్రిగా

లోగడ వారు వేలూరివారిని పండితులుగా జమకట్టారే గాని కవిగా గుర్తించలేకపోయారు. మన కవులు చాలావరకు ఏదో ఒక సిద్ధాంతముపైన వలపు చూపారు. కవియైనవాడు ఒక సిద్ధాంతముపై వలపు చూపెనా? అతని దర్శనము పాక్షికదర్శనమగును అర్ధసత్యమగును పూర్ణయోగముకాదు

'అగ్ని', 'మాతృహృదయము', 'నిష్క్రమణము', 'కుక్కపిల్ల', 'నాగటిచాలు'వంటి అత్యుత్తమ ఖండకావ్యాలు వ్రాసి తెలుగు కవిత్వంలో శాశ్వతస్థానాన్ని సంపాదించుకున్నారు. కవితాగుణాన్నిబట్టి వేలూరివారు ఆధునికాంధ్రకవులలో అగ్రగణ్యులలో ఒకరని అందరూ ఒప్పుకొనక తప్పదు

అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వాన్ని సమీక్ష చేసిన శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారిని వేలూరివారిని ఎందుకు చేర్చలేదని ప్రశ్నిస్తే వారి 'ఏకావళి' చూడలేదన్నారు. వారేగాదు ఆధునిక కావ్య సంకలన గ్రంథాలలో కూడా వేలూరివారి కింతచోటు యివ్వలేకపోయారు. వారికి చాలా అన్యాయం చేశారు: వేలూరివారిని గురించి శ్రీపాదవారి మాటలు: పండితులందరిలోనూ వారు సహృదయులు. వారి రాసిక్యానికి పాండిత్యము ఏనుగుచర్మం కాలేదు. అయితే ఊతపదాలు 'అల్ల' (యేకాంతము) నొయ్యి (కవిత్వము) వంటి అన్నమాటలు పాతవాసన వేస్తాయి. రాళ్లలాగు చెవికి తగులాయి. ఆధునికులు అలాంటివి వాడరనికాదుగాని ఇవి మరీ రాయిగట్టిన మొద్దుపదాలు. రచయితని కనపరుస్తాయి అక్కడక్కడ వాడిన కొన్ని పదాల మాటకేమిగాని వారి కవిత్వంలో ఆధునికత ఉంది. కవిత్వంలో నవ్యతను హర్షించారు. భావకవిత్వంపయి వ్యాసం ప్రకటించారు.

కవిగా వేలూరి వారిని గుర్తించుటకు 'ఏకావళి' కావ్య సంపుటి ఒక్కటి మనకు లభించింది. వారి కథలు గాథలు రవీంద్రుని రచనల కనువాదములు రవీంద్రుని ఫలసంచయము (Fruit gathering) లోని చాలా గీతికలకు అనువాదము లందున్నవి ఏకావళి 1910-39 సంవత్సరముల నడుమ వ్రాసిన కవితాఖండికలు.

ఈ జగత్తు సర్వమేమిటి యేమిటి అన్న ప్రశ్నతో ప్రారంభమవుతుంది. ఏలపాడిచెదవేల అస్తమింతువోయి వేడి కలుపం తెలియదీ వింత నాకంటారు ఆకాశంలో ఊరకే చనెదవేలా కొంచె మిందాగు నీవే కార్యంబు తలంచిపోయెదవని చంద్రుని ప్రశ్నిస్తారు పాములు, తేళ్లు, జెర్రులు వ్యాఘ్రములు, యేదుబందులు, చీమలు దోమలు మొదలగు జీవము లెందుకుండాలి. ఉన్నా పీడ గూర్పనలెనేమి ముదిపండితులు సమన్వయిస్తారుకాని నా కర్థము కాదంటారు ఆయనకు కావలసినవి తోట; తటాకం కొండ, అడవి, ఏఱు, నౌక ఏకాంతం, కొండ తండ్రి తల్లితోట అడవి మిత్రము వాగుపిన్నమ్మ చెఱువు వావి చెల్లెలు. నావవాహనము ఏకాంతము అంతరంగసఖుడు నిర్మల భావోద్యానమందు కూర్చుండి ఛందస్సుకు, యతికి ప్రాసకు నావల నలరారు రచారు కవితనుమత యథేచ్ఛగా రచిస్తారు.

ఇంగ్లీషు చదువుల్ని విసర్జించమనలేదు. సంస్కృతం చాలవరు మాతృభాషను వదలవద్దని ఆంధ్రునికి చేతులొగ్గి ఎదుటనిల్చి వేడుకున్నారు ఒక్కభాషకాదు అన్నిభాషలు నేర్చుకోమని హితవు చెపుతూ మాతృభాషను నిఖిల పుష్పరసముచేత తేనెపెరను చేయమంటారు. కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల కవితా వస్తువులేనన్నాడు శ్రీ. శ్రీ. 1918 లోనే కుక్కపిల్ల శీర్షికతో ఖండకావ్యాన్ని వ్రాశారు అత్యుత్తమంగా.

మాతృహృదయము చక్కనికథ. చెలికయి నంద నందనుడు పూలవనంలోనికి వెళ్లి పారిజాతసుమాలు కోసికొనివచ్చినట్టు శంకరుడు తానలచిన వేశ్యకయి నగలన్ని తెచ్చి తలుపుతీయమంటాడు. ఆ వారకామిని హేమలత తల్లి తలుపుతీసి విూరా అసలే పిట్ట మనుష్యులు పెద్దబరువు మోసున్నారంటూ నగల మూట తీసుకుంటుంది. నీ కుమార్తెకోసం మూడు లోకాలు మోయగలనుగాని వియోగాన్ని మోయ లేనంటాడు. హేమలత ఆయనకు మహాభరణాల్ని తిరిగి

యిచ్చివేయమంటుంది. రత్నాలుకాదు జనని హృదం బుజమును అర్పించమంటుంది. నేను ప్రేమదాసిని గాని హేమదాసిని కాదంటుంది పన్నీరు తెచ్చి గుమ్మరించి, నీ జనని గుండెలు తెచ్చితేని పన్నీ రనుకో కానియెడ ప్రేమదాసి కన్నీరనుకొమ్మని తలుపులు మూస్తుంది. ఇంటికివచ్చి శంకరుడు జనని హృదయాంబుజంబు కోసికొనివచ్చునంతలో 'కుముదినీ విశేశ్వరుండగు చంద్రుండెత్తెత్తి చూచె'ను. సెబాసని హేమలత విలాసవైఖరితో వాకిలి తీసింది వాయు జవంబుతో వాకిలి దాటబోతున్న శంకరునితో హేమలత అంటుంది: 'నీళ్ళు, నీళ్లొగింటబోయితివేని జాతి పడిపోదువు మెల్లంగ బొమ్మునాయనా!' దేవాలయ ప్రవేశంలో శివభక్తుడైన మాలవాని గాధ దేవాలయం లోకి ప్రవేశించే భాగ్యం లేదేయని బాధపడిన మాలవాడు చివరకు మహాభక్తుడై వాని శరీరమునం దతిం ద్రియజ్యోతిలకోల కనబడుతుంది పూజారికి. పదములు పండితోత్తములకు తత్వదృష్టితో భావన చేయనుంటూ మొరపెట్టుకుంటాయి. 'నాగటిచాలు' సాహిత్యాకాశంలో నక్షత్రం. 'గులాబి'లో కవికి గులాబికి సంభాషణ చక్కగా చిత్రించారు. 'కృట' 1910 సంవత్సరములో బుచ్చిరెడ్డిపాలెములో ఒక రెడ్డిగారు చెప్పిన కథ. పాములవాడు, తలనొప్పి, మోహము, శిల్పి మధుర కావ్యాలు ఏకోపాసనలో దేవు డొక్కడే నంటూ సర్వమత సమత్వాన్ని చాటారు 'ప్రేమ'లో వారి సమచిత్తము, సమదర్శనము గోచరిస్తుంది. 30—2—26 లో చిరివాడలో వారి గృహం దగ్ధమైపోయినపుడు వ్రాసింది 'అగ్ని'. హృదయ విదారకమైన రచన. ఆయన సేకరించిన అమూల్య పుస్తక భాండాగారం దగ్ధమైపోయింది. లేకపోతే ఇంకెన్ని రచనలు మనకు లభించెడివో! చదువుకొన నొక్క పుస్తకము లేదు తలచుకొన నొక పద్యము లేదు. నన్ను సన్యాసిగా చేసినాడవయ్య అగ్నిదేవా అంటూ హృదయం పగిలిపోయే ఆవేదనతో ఆక్రో శించారు. ఆయన జీవితాన్ని మార్చివేసిం దీ ఘోర సంఘటన. కాలిపోయిన పుస్తకముల పరామర్శ చేస్తూ పుస్తకాలు గురువులుగా, మిత్రులుగా, సహ పాఠులుగా, చెలియలుగా భావనచేస్తూ మిమ్ము నమ్మిన శిష్యుని, మిత్రుని, సహపాఠిని విడనాడి మంటలో మన్నవారె పుస్తకములార విజ్ఞానపుటములార అంటారు సాహితిరో నన్నుం గౌగిలింప ఎంత చేతులు జాపితో యేమనందునంటూ దుఃఖించారు.

వేలూరివారు పండితులేకాదు కవులు. సహృదయులు. వారి కవిత్వం లలితము. మృదుమధురం. వారు రచనలపట్ల ఎక్కువశ్రద్ధ వహించెడివారు కారు 'ఏకావళి' గ్రంథం మళ్లీ ముద్రణకు నోచు కోలేదు అది మన దురదృష్టం. వేలూరి వారికి మనం ఎంతో అన్యాయం చేశాం.

— శ్రీ శివకుమార్.

# "ఇందుమతీ పరిణయము": కొన్ని సందేహములు

శ్రీ కుమారధూర్జటి 'కృష్ణరాయ విజయము' 'ఇందుమతీ పరిణయము' రచించిన కవివరేణ్యుడు... కృష్ణరాయ విజయకావ్యమున –

'స్తుతమతియైన ఆంధ్ర కవి
ధూర్జటి పల్కుల కెట్లు గల్గెనో
యతులిత మాధురీమహిమ,
నా మును విూ పెదతాత చాల స
న్నుతిగొనెం గృష్ణరాయల
మనోజ్ఞసభన్'..............

అని వ్రాసికొన్న వాక్యమునుబట్టి యీ కవి ధూర్జటికవికి—పౌత్రుడని తెలియుచున్నది. ఇతని గ్రంథాంత గద్యములందును 'ధూర్జటిపౌత్ర' అనియే కలదు. ఇందుమతీ పరిణయమందు కవుల నందతిని పొగడినట్లేకాక, తన తాతగారైన ధూర్జటి కవీ శ్వరుని ప్రత్యేకముగా నొక సీసపద్యమునందు 'ధూర్జటి జటాతటీనటదద్భ్రధునీ తరంగరంగదభంగ వాక్ప్రౌఢి మెరయ' నభినుతించెను. ఈ పద్యము

కుమారధూర్జటికి తన తాతగారిపైగల భక్తి ప్రదర్శనకు గీటురాయి.

ఈ మహాకవి కవికులగురువగు కాళిదాసుని రఘువంశమహాకావ్యమునందలి 5, 6 సర్గములలోని కథ ననుసరించి పెంచి 'ఇందుమతీ పరిణయము'ను రచించి కవికోటిలో అగ్రగతాంబూల మందుకొన్నవాడు.

ఈ కావ్యమును 'కింకవీంద్రఘటాపంచాననులు—శతావధానులు, శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు తాళపత్ర పరిశోధనచేసి, శిథిల భాగములు పూరించి, పరిష్కరించినారు. ఇది చాలకాలమునాడు ముద్రితమైనది. కుమారధూర్జటి కవిత్వము ప్రతి పద్య చమత్కృతితో విరాజిల్లుచున్నది. ఈ మహా ప్రబంధము—వసుచరిత్ర, విజయ విలాసముల యింపు సొంపులను గమనించి రచించి, సుధీజనముచే 'సెబాసు ధూర్జటీ!' అనిపించుకొన్న మిన్న కుమార ధూర్జటి—

ఇతని కవితా విషయమై విపుల వ్యాసము వ్రాయు తలంపుతో కావ్యమంతయు పఠించితిని. ముందుగా గొన్ని ప్రమాదములు కవివో, లేఖకులవో, తెలియవీలుగానివి గోచరించినవి. వానిని విజ్ఞులకు విన్నవించి సందేహములు తొలగించుకొను బుద్ధితో నీ వ్యాసమును వ్రాయుటకు ముందంజ వేసితిని ఈ కావ్యమునకు అయిదారు పుటల తప్పొప్పుల పట్టి కయు కలదు. అందును వీనికి సవరణ లేదు ఈ నా సాహసమును రసజ్ఞలోకము మన్నించుగాక

## యతి ప్రమాదములు

(1) ప్రథమాశ్వాసము 142 పద్యమందు

శ్రీ తపనీయ రత్నగుణ
చిత్ర ఘృణుల్ గగనేందిరా కచో
ద్భూత సుమప్రభేదగతి
సొంపు వహింప నిలింప భామినీ...

దీనియందుఁ గ్రిగీటులుగల 'ద్భూ' అను దానికి - 'సొం' అను దానికి యతి మైత్రి యెట్లు?

(2) ప్రథమాశ్వాసము—149 సీసపద్యము మూడవ చరణమున

'తమ పదన్యాస దు
ర్భర భారమెనసిన—శేషాహి'

తమ...దుర్భర—అను దానియందు 'త—ర్భ' లకు మైత్రి యెట్లు? 'దుర్గమభార' అన్నచో యతి మైత్రి—లేక ప్రాసయతి చెల్లునుగాని, అను ప్రాస రామణీయకము కొఱవడును. విజ్ఞులు నిరూపింతురుగాక—

(3) ద్వితీయాశ్వాసము 55 పద్యమునందు—

..................................
...............సైన్యముల్ గొల్వఁగా
గౌరజన్ సన్నరుమాలు హొన్నరిగె కు
చ్చుల్ చెన్నునం జౌకళిం
చ రువారంబుగ............

ఇందు—'గౌ'—అను దానికిని 'చ్చు' అనుదానికిని యతి యెట్లు పొసగును?

(4) పంచమాశ్వాసము 33 వ పద్యమందు—

.........మృదంగజ తాళజ దింధిమిధ్వనుల్
మెచ్చుఘటించ వారరమ
ణీ గణముల్ ఘటియించె.........

ఇందు మె—ణీ—లకు యతి ఘటిల్లునా?

(5) పంచమాశ్వాసము 83 పద్యమున

'.........మదనుకెంగేలి విజయ
శంఖమున గద్దె బిరుదు నాఁ
జెలువువిూతె'

శ—కును—చె—కును యతి చెల్లు టెట్లు? 'సొరువిూతె' అనిన చెల్లునేమో?—

(6) పం. ఆశ్వాసము—138 పద్యమున

ఇతని వరియించెదే యన నిందుఁగనిన
యల్ల పద్మిని బోలి యవ్వలఁజనంగ,

దీనియందు అ – వ—లకు యతిమైత్రి శాస్త్ర సమ్మతమా?

(7) పం. ఆశ్వాసము—168 పద్యమున

'దేవహితకార్యవృత్తి దైతేయ మర్ద
న ప్రవీణత జెంది యయ్యింద్రుకృపను—

ఇందు 'న– యి, అనువానికి మైత్రి లక్షణ సిద్ధమా?

(8) షష్ఠాశ్వాసము– 93 వ పద్యమున–

'కాండ ప్రకాండ రింఖా సముద్ధతరజ
స్తతి పద్మజాండభాండంబు నిండ'

'స్త' 'డ' లకు యతి యెట్లు తగునో విచారింపుడు.

(9) ష: ఆశ్వాసము 103 మహాస్రగ్ధరయందు–

'.....................శస్త్ర
ప్రమా భూపాల కోటీరములు తడబడన్
సారథుల్ గూలజేయన్,

దీనియందు–'ప్ర—ర—సా' అను వర్ణములకు యతి ఘటితమైనది. మహాస్రగ్ధర లక్షణము ననుసరించి ప్రతిపాదమున రెండు యతి స్థానములుండును. 1, 9, 16, యతి నిలుచు స్థానము. 'ప్ర-ర' అనువానికి 16 వ అక్షరమగు 'సా' అను వర్ణముతో మైత్రి యెట్లు?—

(10) ష—ఆశ్వాసము 116 వ పద్యమున -

'...........క్రొంజిగి పట్టుపట్టె సం
ధిలు నెఱనేత వింత నగి
షీ గల మంచముమించు మంచి చెం
గలువల పాన్పు'

ఈ పద్యమున 'ధి' అను వర్ణమునకు 'షీ' అను అక్షరమునకును యతి చెల్లునా?

## ప్రాస ప్రమాదము

(11) షష్ఠాశ్వాసము 4 పద్యమున–

'విమలమణీ....................
రమణుల ముద్దుమోములు...........
భ్రమ విచరస్మరాళి నిక
రంబు లనంగ గనీనికాతతుల్
మెఱయగ శిల్పి లబ్జములు
మేడల జాడల నుంచిరోయనన్'

మకారప్రాసబద్ధమైన యీ పద్యమందు నాల్గవ పాదమున శకటరేఫము ప్రాసస్థాన మాక్రమించినది. ఈ ప్రమాదము ఎట్లు సవరింపవీలగునో– విజ్ఞులు, విమర్శకు లూహించి తెలియజేయుదురని విజ్ఞాపన మొనర్చుచు, ఈ వ్యాస సందేహములు తొలగునట్టి పూర్వప్రతులు గలవా? వానిలోగల పాఠాంతరములు వివరింతురుగాక–యని ప్రార్థించుచున్నాను.

—శ్రీ చింతలపాటి నరసింహదీక్షితశర్మ.



# గ్రంథ విమర్శలు

## ఇహపరములు

(గ్రంథకర్త : శ్రీ వావిలాల రామమూర్తి, ప్రచురణ : సాహితీ సమితి, కొత్తపేట – ఒంగోలు మూల్యము : మూడు రూపాయలు)

ఇది ఖండకావ్య సందోహము. ఇనగా నిందు మూడు కృతులున్నవి. ఒకటే నిజముగా ఖండకావ్యము. వివిధములైన ఇరువది రెండు శీర్షికలతోడి పద్యము లందున్నవి ఈ మొత్తమునకే ఇహపరములు లని పేరు. మిగిలిన రెండు కృతులలో నొకటి 'శాంతి సందేశము', రెండవది 'రాణీ సంయుక్త'. భారతదేశ స్వాతంత్ర్యమునకై సాగిన ఉద్యమములో చివరి ఘట్టము హిందూ మహమ్మదీయ సంఘర్షణ—అందు గాంధిగారు నిర్వహించిన పాత్రలను గురించి వ్రాయబడినది, శాంతి సందేశము. రాణీసంయుక్త సరే సరి. అది ఒక చిన్న చారిత్రక సన్నివేశము.

ఇహపరములన్న ఖండకావ్యములో ఇహపరములకు సంబంధించిన అంశములు రెండును కలవు. శ్రీ శ్రీరామమూర్తిగారు భగవద్భక్తులు, దేశభక్తులు. అందువలన ఈ రెండు విధములయిన రచనలును అందున్నవి. శ్రీరామమూర్తిగారు మంచి వ్యుత్పత్తి బలము కలవారు. చక్కని పద్యరచనాపాటవము కలవారు. భగవద్భక్తి వైభవమును కీర్తించుటలో శ్రీరామమూర్తిగారు కాళహస్తీశ్వరకవి ధూర్జటిని స్మృతికి దెచ్చెదరు

'మమకారంబును వీడి,
సౌఖ్యములంగొంప వ్రీడగా గొట్టి
చుట్టములం బక్కము లందఱన్
గరిటెకాడంగాల్చి పెట్టించి,
లోకము మిథ్యాత్మకమంచు ద్రోసి
మఱి యేకాంతమ్ముగానిల్చి
మోక్షముకై పోంగ నేమిగా నగుదునో
స్వామీ! జగన్నాయకా'

ఎన్నికల సందడిని వర్ణించు ఈ క్రింది పద్యము—ఎన్నికల మంచి చెడ్డలను సంపూర్ణముగా స్ఫురింప జేయుచున్నవి.

'నిన్నటిదాక వైరియట
స్నేహము పొంపిగి పోవ నండయ్యె
నెన్నడుమున్ బిగించె నొకనిన్
గెలిపింపగ వేఱొకండు, సం
పన్న గృహస్థు నింట దలపం దల,
లొక్కటెకాక యుండఱున్
భిన్నులు వైరి, దంపతుల
వెమ్మదులందిడె జిచ్చు నెవ్వడో!

సాహిత్యాభిమానులు సమాదరింపవలసిన కవితా ఖండముల సంపుటి యిది.

## శ్రీ కృష్ణలీలాతరంగిణి

(సంపాదకులు : శ్రీ నోరి నరసింహశాస్త్రి. ప్రచురణ : సాహితీసమితి రేపల్లె. మూల్యము : ఆరు రూపాయలు.)

శ్రీ నారాయణానంద తీర్థులు రచించిన శ్రీ కృష్ణలీలాతరంగిణిని శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ఒక ముప్పది పేజీలమేర ఆంగ్లములో ఉపోద్ఘాతము వ్రాసి, మూలగ్రంథమును నాగరిలిపిలో అచ్చువేసిరి శ్రీ నరసింహశాస్త్రిగారు నారాయణ తీర్థుల దేశకాలములను గూర్చి ఇంతవరకు ప్రసిద్ధమై యున్న అభిప్రాయముల నొకచో చక్కగా క్రోడీకరించి, తీర్థులవారి జీవిత విశేషములను తెలిసినంత వరకు సమకూర్చి వ్రాసినారు. నారాయణతీర్థులవారి కృతులను గురించియు, ఇందలి పాటలనుగూర్చియు. శ్రీ శాస్త్రిగారు విశేషాంశములను వివరించిరి.

శ్రీ తీర్థులవారు ఆంధ్రులగుటచేత వారి కీర్తి ఉత్తరాదిజనమధ్యమునందును వెల్లివిరియుచుయున్న ప్రీతిభావముతో ఈ గ్రంథమును నాగరిలిపిలో ముద్రించుట హర్షింపదగియున్నది. శ్రీ శాస్త్రిగారు తమ ఆంగ్లోపోద్ఘాతమున అద్వైతమున భక్తి, ఉపాసనలకుగల ప్రమేయమునుగురించికూడ ప్రస్తావన చేసిరి

ఈ శ్రీ కృష్ణలీలాతరంగిణి వావిళ్లవారు తెలుగు లిపిలో నింతకుముందే అచ్చువేసిరి. ఈ దేశమున నిది మిక్కిలి ప్రచారముననున్న గ్రంథమే. శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు శ్రీ నారాయణతీర్థుల వారి మూలగ్రంథమును, తాళపత్రములు వగైరాలు చూచి సంపాదించుటను పెట్టుకొన్నవారుకారు వావిళ్లవారి తెలుగు లిపిలోని గ్రంథము నాగరిలిపిలోనికి కూర్చబడినది తెలుగురానివారికీ పుస్తకముపయోగపడగలదు శ్రీ నరసింహ శాస్త్రిగారి ప్రయత్నము కొనియాడదగియున్నది.

## వ్యాసావళి

(ప్రథమ భాగము)

(గ్రంథకర్త: శ్రీ బండారు తమ్మయ్య. ప్రకాశకులు: శ్రీ నిర్మల శైవసాహితీ గ్రంథమాలిక, నండూరివారి వీథి, గాంధీ నగరము కాకినాడ-4. మూల్యము: అయిదు రూపాయలు)

ఆంధ్ర వాఙ్మయమున శైవవాఙ్మయము కొంత గలదు. ఈ శతాబ్దమున ఆ శైవవాఙ్మయ విషయ పరిశోధన చేసిన మహనీయులలో శివశ్రీ బండారు తమ్మయ్యగారు ముఖ్యులు. ఆయన దాదాపు ముప్పది నలుబది సంవత్సరములనుండి ఈ విధమైన సాహిత్య పరిశోధనలో తలమున్కలుగా ప్రవర్తించుచున్నారు. ఆయన అనేక విషయాలమీద అప్పుడప్పుడు పత్రికలలో తన పరిశోధన ఫలితములను వ్యాసములుగా వ్రాసి ప్రచురించుట కలదు. అట్టివ్యాసములలో కొన్నింటిని (పదకొండింటిని) ఇప్పుడీ పుస్తకరూపమున ప్రకటించిరి. ఇందులో ఈ వ్యాసములకు ముందు నలుబది పుటలమేర శ్రీ తమ్మయ్యగారు వ్రాసిన పద్యములు కొన్ని ప్రకటింపబడినవి. ఇట్లీ పుస్తకము కలగాపులగముగా నున్నది.

భరతధాత్రి, కల్యాణపురీప్రశంస, బసవేశ్వరుడు, రెడ్డి పౌరుషము, ఆంధ్రమలయరాజస్తవము, కాళిదాస ప్రశంస, చాటూక్తిముక్తావళి — ఈ శీర్షికలతో నున్నవి పద్యములు. మార్గదేశికవితలు, నన్నెచోడునికాలము, నన్నెచోడుని గురుసుతి తత్త్వము, ధూర్జటి యాధ్యాత్మికత, పిడుపర్తి కవులు, మాడయ్యగారి మల్లన, ఆంధ్రవాఙ్మయముపై శైవమత ప్రాబల్యము, శివపంచస్తవములు, పదిరెకుంటము వీరభద్ర శర్మగారు — జగద్గురు స్మృతి, వీరశైవ వాఙ్మయము — తద్విశేషములు — ఈ శీర్షికలతో నున్నవి వ్యాసములు ఈ వ్యాసము లన్నియును సాహిత్య విషయములే — ఒక్క వీరభద్ర శర్మగారు జగద్గురుస్మృతి తప్ప. వీరభద్ర శర్మగారే జగద్గురువులు. ఆయన జీవిత విశేష చరిత్రమునుచెప్పి పద్యమ్ములలో స్మరించుట అందలి విషయము.

ఆంధ్రవాఙ్మయ పరిశోధక పండితులలో పట్టుదలలు లేనివారు లేరు శ్రీ తమ్మయ్యగారు పట్టుదలలు మరియు నెక్కువగా కలవారు సాధారణముగా ఆయన రాజీపడరు. ఆ విషయమున ఆయన వీరశైవులు. ఆయన పరిశోధనయు నంత నిజాయితీతో కూడుకొన్నది. అందువల్ల ఆయన మాటకు మంచి ప్రామాణ్యమున్నది. ఈ గ్రంథమునకున్న లోపమొక్కటియే. అది—ఏ విషయముగాని క్రొత్తదనము గలిగి ఆసక్తిదాయకముగా లేకపోవుటయే రచయిత మొదట వీటిని వ్రాసినప్పుడివి ఒక సంచలనమును కలిగించినవే. కాని ఇప్పుడాసమస్యలు విరమించుకొన్నవి. బ్రతికినంతకాల మొకటియేనా సమస్య? అది తేలునుగాక, తేలకపోవునుగాక దాని నొప్పుడు వదలి అన్యసమస్యలను ఆకళింపుచేసికొను ప్రయత్నము చేయవలయును. అందువలన ఆధునికాంధ్ర సాహిత్య విద్యార్థికీ వ్యాసములందలి విషయములంత ఆలోచ

నియములుగా కనిపింపవు. పరీక్షల దృష్టితో సాహిత్య విమర్శనమును వాఙ్మయచరిత్రమును అధ్యయనము చేయువారికి శ్రీ తమ్మయ్యగారి వ్యాసములు తప్పక చదువదగిన పెన్నిధానములే యగును.

(1) మార్గదేశి కవితలు ఛందస్సునుబట్టి యేర్పడినవియే, సంస్కృత వృత్తములతో నున్నవి మార్గకవితలు. దేశి ఛందముల నున్నవి దేశికవితలు— ఈ యభిప్రాయమును మొదటి వ్యాసమున శ్రీ తమ్మయ్యగారు వివరించి వ్రాసిరి. (2) నన్నెచోడుడు తిక్కనగారి తరువాతివాడను వాదమును శ్రీ తమ్మయ్యగారు సమర్థించుచు తదితరములను త్రోసిపుచ్చుచు, నన్నెచోడుని కాలనిర్ణయమున కాయన పేర్కొనిన నవనాథుల విషయము సహాయకారి కాగలదని అభిప్రాయపడినారు. (3) నన్నెచోడుని గురుస్తుతి తత్త్వముకూడ నన్నెచోడుని కాలనిర్ణయ విషయ చర్చనే చేసిరి. (4) శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము, శతకము రెండును వ్రాసిన దొక ధూర్జటి అనియే అభిప్రాయమును వెలిబుచ్చి, ఆ రెండు కృతులయందును ధూర్జటి తనకు కాళహస్తీశ్వరునిపట్లగల భక్తిభావము నెట్లు వ్యక్తము చేసెనో శ్రీ తమ్మయ్యగారు సోదాహరణముగా నిరూపించిరి (5) ఆంధ్రదేశమున వీరశైవమ-సాహిత్యవ్యాప్తికి మిక్కిలిగా కృషిచేసిన కవులు పిడుపర్తి కవులు. వారి దేశకాలములను గూర్చియు, వారి కృతులను గూర్చియు విపులముగా చర్చించినారు తమ్మయ్యగారు పిడుపర్తి కవులు గుంటూరుమండలమువారై యుందురను తమ అభిప్రాయమును సహేతుకముగా చూపిరి. (6) రాయల కాలమున ప్రబంధము లన్నియు మిశ్రకథాకలితములేకాగా మాదయ్యగారిమల్లన రచించిన రాజశేఖరచరిత్రము స్వతంత్ర గ్రంథముగా నున్నదని శ్రీ తమ్మయ్యగారు ఆ కావ్యమును సంపూర్ణముగా విమర్శించిరి కవిజీవిత వృత్తము, కృతిపతివిషయము, కథాసంగ్రహము, కావ్యవిశేషములు ఇత్యాది శీర్షికలతో నా ప్రబంధమును చక్కగా ప్రశంసించిరి. (7) శ్రీతమ్మయ్యగారు ఆంధ్రవాఙ్మయముపై శైవమత ప్రాబల్యమెట్లున్నదో మిక్కిలి శ్రద్ధగా పరిశోధించి ఆయా కవుల ఆయా కృతులయందలి ఆయా శైవవిషయముల నెత్తిచూపుచు వ్రాసిన వ్యాసము చాల చక్కని విషయ వైశారద్యము కలిగి చిక్కగా నున్నది మరియు నీ శైవమత ప్రాబల్యము—వైష్ణవమునెట్లు ప్రేరేపించినదో కూడ శ్రీ తమ్మయ్యగారు పరిశీలించిరి. (8) మహిమ్నము, మల్హణము, బిల్హణము, హాలాయుధము, అనామయము — అను ఈ ఐదును శివస్తుతులు. ఇవి రచింపబడిన కాలములను గూర్చియు, ఆ కవులుపొందిన ప్రయోజనసిద్ధులకు సంబంధించిన గాథలను గూర్చియు శ్రీ తమ్మయ్యగారు సరళసుందరముగా వ్రాసిరి. (9) వీరశైవమత స్వరూప స్వభావములను రేఖామాత్రముగా స్పృశించి సంస్కృతాంధ్రములయందున్న వీరశైవమత ప్రబోధకములయిన గ్రంథములనుగూర్చి స్థూలముగా స్పృశించు వ్యాసమన్నిటికిని వివరది.

ఈవిధముగా మొత్తముమీద శైవమతమునకు శైవవాఙ్మయమునకు సంబంధించిన బహువిషయ విశేషములను శ్రీ బండారు తమ్మయ్యగారు కేవల శివభక్తి ప్రేరణతో పరిశోధించి విమర్శించి యుండిరి. ఇందు కొన్ని ఈ విధముగా పుస్తకరూపమున ప్రకటింపబడుట ఒకవిధముగా ప్రజాహిత కార్యమనియే అనదగును. సాహిత్యవిద్యార్థులు తప్పక పఠింపదగిన వ్యాససంపుటమిది.

## ఉదాహరణ వాఙ్మయ చరిత్ర

(గ్రంథకర్త : శ్రీ నిడుదవోలు వేంకటరావు, ప్రకాశకులు : విజయభాస్కర పబ్లికేషన్సు, హైదరాబాదు ప్రతులకు : గ్రంథకర్త, 22.1137/5, న్యూ నల్లకుంట. హైదరాబాదు—13. మూల్యము: ఆరు రూపాయలు )

ఆంధ్ర వాఙ్మయమున నొక విశిష్టమైన శాఖ ఉదాహరణము. దీనిని వెలుగులోనికి తెచ్చిన గౌరవము శ్రీ వేంకటరావుగారిదే ఆయన త్రిపురాంతకోదాహరణమును 1937 లో ప్రచురించి

నప్పటినుండియు పదిమంది విద్వాంసుల దృష్టియు ఆ ప్రక్రియమీద పడినది కొందరు క్రొత్తగా ఉదాహరణములను రచించినారుకూడా. అప్పటినుండి సంస్కృతాంధ్రములందున్న ఉదాహరణములను గూర్చి పరిశోధించి శ్రీ నిడుదవోలు వేంకటరావుపంతులుగారు 1950 లో ఉదాహరణ వాఙ్మయ చరిత్రమును ప్రకటించిరి. దాని పునర్ముద్రణమే యిప్పుడు సమీక్షింపబడుచున్న ఈ పుస్తకము

ఈ గ్రంథమునముందు ఉదాహరణ కావ్యలక్షణము—చారిత్రకముగా నా ప్రక్రియ పుట్టుపూర్వోత్తరములు—సంస్కృతోదాహరణ లక్షణము - ఛందోవిశేషములు, దేశియములయిన రగడలు వాని లక్షణములు వివరించి వ్రాయబడినవి. ఆ పిమ్మట కాలక్రమము ననుసరించి సంస్కృతాంధ్రోదాహరణములు, పరిశిష్టముగా భోగావళి మొదలయిన దేశియ రచనల లక్షణములు సమకూర్పబడినవి. ఇవిగాక మరియు తెలుగు లాక్షణికులు వివరించిన ఉదాహరణ లక్షణములు, ఉదాహరణ సామ్యముగల పద్యములుగూడ నిందు సంగ్రహింపబడినవి.

శ్రీ వేంకటరావుపంతులుగారీ ఉదాహరణ ప్రక్రియకు ప్రాచీనతను సమకూర్చు నుద్దేశ్యముతో కాళిదాసు రెండు తావుల ప్రయోగించిన ఉదాహరణ శబ్దమును పేర్కొని ఆ రఘువంశ, విక్రమోర్వశీయముల రచనాకాలమునప్పటికీ ఉదాహరణము ప్రసిద్ధమైయున్నదని నిరూపించుటకు ప్రయత్నించిరి. సంస్కృతవాఙ్మయమున స్తుతులు కొల్లలు. ఉదాహరణ ప్రక్రియ స్తుతి రూపమున నున్నదే. ఇది సంస్కృతమున అంత ప్రాచీనకాలమునందే ప్రసిద్ధమైన రచనాప్రక్రియయైనచో పాల్కురికి సోమన రచించుదాక ఆ భాషలో ఉదాహరణ మొక్కటియైనను ఏలలేదు? అన్నియు నశించియుండుననుట మంచిమాటకాదు. అందువల్లను మరియు దీని రచనారీతినిబట్టియు, ఇది దేశి సాహిత్య ప్రక్రియ అనియే అనుకోదగును. మనకు తెలిసినంతవరకు పాల్కురికి సోమనాథుడే దీనిని ఆంధ్రభాషయందు వెలయించినాడనుటయే యుచితము.

ఇది ఉదాహరణ వాఙ్మయ చరిత్ర యనబడుటచేత ఉదాహరణప్రక్రియయొక్క చారిత్రక పరిణామమునుగూర్చియు, ఆయా యుదాహరణములు రచించిన కవుల కవితారీతి విధానమును గూర్చియు శ్రీ వేంకటరావుగారు వ్రాసియుండవలసినది. ఆ పని ఆయన ఎందుకు చేయలేదో తెలియదు. అందువల్ల ఈ గ్రంథమునకు సర్వసమగ్రత్వము లోపించినది ఆధునికులు రచించిన ఉదాహరణములను ఇందుచేర్చి ముద్రించిన శ్రీ వేంకటరావుగారు పండితారాధ్యోదాహరణమును ఇందు చేర్చకపోవుట కాయనగారు చెప్పిన కారణమగుపించుటలేదు. అది పాల్కురికి సోమనాథుడు రచించినదని ఆచార్య శ్రీ రామరాజుగారు దానిని సంపాదించి ప్రకటించినారు. అది పాల్కురికి సోమనాథునిది కాదని శ్రీ వేంకటరావుగారందురు వాదమున కాయనమాట నంగీకరించినను ఆ ఉదాహరణము నాయన తమ ఉదాహరణ వాఙ్మయచరిత్రమున చక్కగా ముద్రింపవచ్చును. ఒక ప్రాచీనోదాహరణమునట్లు తిరస్కరించుట ఏమియును బాగుగా లేదు.

ఉదాహరణ లక్షణ విషయ విచారమునను శ్రీ వేంకటరావుగారింకను కొంత పరిశ్రమచేసి వ్రాయవలసినది.* విద్యానాథునికన్న యిందు అమృతానందనాథుడను లాక్షణికుడొకడు ఉదాహరణ లక్షణమును చెప్పియున్నాడు. ఆయనచెప్పినది విద్యానాథుని దానికన్న సమగ్రముగానున్నదని పండితులనుచున్నారు. గొబ్బూరి నరసరాజు ఆస్థానములోనున్న కృష్ణయజ్వ యనుకవి తన అలంకార ముక్తావళిలో ఉదా

హరణ లక్షణము చెప్పి లక్ష్యముగా నొక యుదాహరణమును రచించినాడు. ఈ రెండు విషయములను శ్రీ వేంకటరావుగారు పట్టించుకొనలేదు. ఆధునిక రచయితలు రచించిన ఉదాహరణములుకూడ అన్నియు శ్రీ వేంకటరావుగారి కందినట్లు లేవు. సంస్కృతములో వ్రాసి ప్రకటించిన శ్రీ శ్రీ భాష్యం విజయసారథిగారి ఉదాహరణములుకూడా శ్రీ వేంకటరావుగారి దృష్టిలో పడలేదు. ఇట్లే మరియు తెలుగులో శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు వ్రాసిన ఉదాహరణ ప్రసక్తిగాని, ఒక పద్ధతి ఉదాహరణమును ఆరుద్రగారు రచించిరి–దాని ప్రశంసగాని ఈ ఉదాహరణ వాఙ్మయ చరిత్రమున లేకుండుట దీని సమగ్రలక్షణమును దెబ్బకొట్టుచున్నది. శ్రీ వేంకటరావుగారు తాము రామోదాహరణమును రచించినామని ఇచ్చిన పద్యములు కళికోత్కళికలు లేనివి. అవి యున్నప్పుడే ఉదాహరణ మనిపించుకొనును. అవి లేనిచో అది మరొకటి యగును. ఉదాహరణము కాదు.

శ్రీ వేంకటరావుగారు పేర్కొన్న ఉదాహరణలను ఆయా రచయిత లందరును ఒక పద్ధతిగా వ్రాయలేదు వారు వేరే భిన్నమార్గముల నవలంబించినదియు వాఙ్మయ చరిత్రకారుడు చెప్పవలయును. శ్రీ వేంకటరావుగారా బాధ్యతను గూడ స్వీకరింపలేదు. మొదటి ముద్రణమున ఇవన్నియు లోపములు కావు. రెండవ ముద్రణమున తప్పక ఇవి లోపములనియే చెప్పవలయును.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన గోపాలోదాహరణము మానవపరమని శ్రీ వేంకటరావుగారు వ్రాసినది వ్రాయకూడని మాట అది నందమూరులోని వేణుగోపాలస్వామివారిని స్తుతించినది

శ్రీ వెంకటరావుగారు ఈ గ్రంథమును తిరిగి ప్రకటించుటయే పదివేలు. బుద్ధిమంతు లీ విషయమున శ్రద్ధ తీసికొని పరిశ్రమించవలయును. అందుకు పీఠికగా ఈ ముద్రణము పనికివచ్చును. పైన పేర్కొనబడిన లోపముల నాయన సునాయాసముగా తర్దుబాటు చేయగలరు. కాని వయస్సనుమతించినది కాదు.

—క్షేమేంద్ర.

## వారధి

(నవల)

(రచన : ద్వివేదుల విశాలాక్షి. ప్రచురణ, ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మదరాసు – 1: వెల రు 2–00)

గతసంవత్సరంనుంచి నెలకు నాలుగువంతున వెలువడుతున్న ఎమెస్కో పాకెట్ పుస్తకాలలో 'వారధి' నవల ఒకటి. చదువరులకు దళారీల బెడదలేకుండా నేరుగా చవకధరలకు రచనలు అందించాలనేది ఈ ప్రణాళిక పరమార్థం పలువురు ప్రముఖ రచయితల, రచయిత్రుల రచనలు ఈ ప్రణాళిక క్రింద వెలువడి పాఠకలోకంలో యిప్పటికే ప్రాచుర్యం, పలుకుబడి సంపాదించుకున్నాయి.

ఈ పాకెట్ పుస్తకాలలోని ఎన్నదగిన కొన్ని మంచినవలలో ఈ 'వారధి' ఒకటి. ఈ పుస్తకంలో ప్రచురణకర్తలుగాని, రచయిత్రిగాని ఎక్కడా చెప్పలేదుగాని, ఈ నవల ఒకానొక ప్రసిద్ధ వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడింది. నిగ్రహంతో కూడిన కథనమూ, సాంఘిక సమస్యలను గురించిన ఆలోచనా, ఆలోచనను ప్రేరేపించగల రచనాపద్ధతీ... యివి ఈ రచయిత్రిలోని సుగుణాలు. ఏదో తోచినట్టుగా మొదలుపెట్టి తోచినవిధంగా వ్రాసుకుంటూ పోయి, తోచినచోట ముగించడం కాకుండా చక్కని ప్రణాళికతో రచన చేయగల సామర్థ్యం ఈ రచయిత్రిలో పుష్కలంగా ఉంది.

రచయిత్రి ఈ నవలలో ఒక పల్లెటూరిలోని మధ్యతరగతి కుటుంబం చుట్టూ కథ అల్లారు. మరిది కాలేజీ చదువుకని దాపులోనేఉన్న పట్నం పోతూవుంటే తరుముకునివెళ్ళి మరీ తాను చేసిన సున్నిఉండలు అందించిన విశాలాక్షి తెలుగు ఆడపడుచుకు ఆదర్శచిత్రణ వదిన అంటే వరదరాజుకు

ఎనలేని గౌరవం... ప్రేమా... శివయ్యకు సరేసరి...... సవతి తమ్ముడైనా రాజు అంటే ఎంతో ఆపేక్ష... వరదరాజుకు యిల్లు విడిచి చదువుకు వెళ్లడం యిష్టంలేదు. అయినా వెళ్ళాడు పట్నంలో సంపన్ను డైన రాఘవయ్యగారి కంట్లో పడ్డాడు. ఆయన కూతురు అనూరాధ రాఘవయ్యగారు రాజుకు ఎం. ఎస్. సి. చెప్పించే బాధ్యత తాను స్వీకరించాడు. అతన్ని అల్లుడిగా చేసుకున్నాడు. వరదరాజు క్రమంగా తనఊరికీ, తనవారికీ దూరమై పోయాడు. అతన్ని 'చిన్నాన్నా' అని ప్రేమగా పిలిచే పసిపిల్ల పూర్ణ చచ్చిపోయింది. వరదరాజు బంగారు పంజరం లోని పంచెవన్నెల చిలుకలా మారిపోయాడు. శివయ్య అప్పులపాలై, ఆస్తి అమ్ముకోవలసి వచ్చింది. కాని రాజు నిస్సహాయుడు. అన్నా వదినెల దైన్యం అతన్ని క్రుంగదీసిందేగాని అతడేమీ చెయ్యలేకపోయాడు. అతడు ప్రాణాధికంగా ప్రేమించిన అనూరాధ పురుటి సమయంలో మరణించడంతో, ఆమె కన్న పసివాడు కూడా దక్కకుండా పోయినప్పుడు అతనికి ఏమీ మిగల లేదు. దీనితో ఆ పట్నానికీ, ఆ కుటుంబా నికీ, అతనికీ ఋణం తీరిపోయింది. అతడు మళ్లీ తల్లిదండ్రులవంటి అన్నా వదినెల దగ్గరికి, పుట్టి పెరిగిన ఊరికి చేరుకున్నాడు

రచయిత్రి తెలుగు కుటుంబ జీవితాన్ని చక్కగా చిత్రించారు. నేటి పారిశ్రామిక తత్త్వంవల్ల సంఘంలో, కుటుంబ జీవితంలోనూ వస్తున్నమార్పు లను, మంచి చెడులను ఆలోచన ప్రేరేపించగల రీతిలో చిత్రించారు. తెలుగుపాఠకులు అవశ్యం పఠించదగిన నవల యిది.

—పి.

## రణ విజయం

గేయ సంపుటి. రచయిత—శ్రీ శీలం రాజేశం, పుటలు–24, వెల: 0–25. ప్రాప్తిస్థానం— శ్రీ శీలం రాజేశం, 5/610, లష్కర్‌బజార్, హనుమ కొండ.

## ఈరోడ్డు ఎక్కడికి?

సాంఘిక నాటకం రచయిత–డాక్టర్ కొర్ల పాటి గంగాధరరావు. పుటలు– 18. వెల 1–50. ప్రాప్తిస్థానం– విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయ వాడ–1.

నల సోమ భూపాలీయమనే నాటకం రచయిత: శ్రీ కె. శ్యాలన్న. పుటలు–62. వెల : 1–00. ప్రాప్తిస్థానం–విద్యార్థి సంఘం, సంఘం, ప్రభుత్వో న్నత పాఠశాల, గద్వాల.

## భజగోవిందం: ముకుందమాల

ఆంధ్రానువాదసహితం. అనువాదకుడు – శ్రీ వేదాంతం కాశీనాథం. పుటలు–32. వెల–50. ప్రాప్తిస్థానం–సరసకవితా సదనము, వేములవాడ.

## భువన విజయము

విజయనగర వైభవం తెలిపే నాటిక. రచన— శ్రీ పెనుమాడు వేంకటశేషయ్య. పుటలు– 42. వెల రు 1–25. ప్రాప్తిస్థానం–శ్రీ పి. వెంకట కృష్ణయ్య, యల్లంపేట, కడపజిల్లా.

## సమర్పణ

కథల సంపుటి. పుటలు — 78. వెల— రు 1–50. ప్రాప్తిస్థానం–యువతర రచయితల సమితి, నల్లగొండ.

## సాయి అష్టోత్తర శతనామావళి

ఇది శుద్ధ బ్రహ్మ పరాత్పర రమ' అనే పద్ధ తిలో 'అనంతశక్తి స్వరూపా సాయి' అని ప్రారంభ మవుతుంది రచయిత—శ్రీ ఉపద్రష్ట సంగమేశం. పుటలు—పాకెట్ సైజు 16. వెల తెలియదు. ప్రాప్తిస్థానం–ఉపద్రష్ట సంగమేశం, 40, ఎడ్వర్ ఇలియట్స్ రోడ్డు, మైలాపూరు.

## శ్రీ పద్మావతీ పరిణయం

పద్యకావ్యం. రచయిత. శ్రీ రావుల సూర్య నారాయణమూర్తి. పుటలు—32 వెల–0–75. ప్రాప్తిస్థానం – నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాద్.

## శ్రీ వేంకటేశ్వర శతకము

రచయిత-శ్రీ బూడూరు నరసింహులురెడ్డి, పుటలు-22. వెల - 0—60. ప్రాప్తిస్థానం—శ్రీ బూడూరు నరసింహులురెడ్డి, ప్రధానాంధ్ర పండితులు, జిల్లా పరిషదున్నత పాఠశాల, కార్వేటి నగరం. (చిత్తూరుజిల్లా.)

## వ్యాధిగ్రస్తుడు

స్త్రీపాత్రలేని అవ్సర్డ్ నాటిక. రచయిత—శ్రీ దోనేపూడి రాజారావు పుటలు—40. వెల—1-50. ప్రాప్తిస్థానం—వాణీ పబ్లికేషన్స్, మెయిన్ రోడ్, గాంధీచౌక్, తెనాలి—1.

## గిడుగు వంశవృక్షము

రచయిత్రులు —శ్రీ మంచాలు గిడుగు లక్ష్మీకాంతమ్మ, శారదాంబ. పుటలు—158. వెల—2—00 ప్రాప్తిస్థానం, శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ, c/o శ్రీ జి. వి. శ్రీనివాసరావు, అడ్వకేట్, బాపట్ల.

## మనుచరిత్రము—అల్లసాని పెద్దన

విమర్శ గ్రంథము. రచయిత—శ్రీ కర్రా వేంకట సుబ్రహ్మణ్యము, పుటలు—88 వెల—2—00 ప్రాప్తిస్థానం—శ్రీ రాయల సాహిత్యపరిషత్తు, ప్రొద్దుటూరు. కడపజిల్లా,

## తిలక్ లేఖలు

కథకుడు కవి అయిన కీర్తిశేషుడు శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్ కొందరు సాహిత్యసేవకులకు వ్రాసిన లేఖల సంకలనం పుటలు—146. వెల—3—00 ప్రాప్తిస్థానం శ్రీమతి ఎం ఎం. దేవి, సెక్రటరీ, తిలక్ సాహితీ సరోవరము, తణుకు, పశ్చిమ గోదావరిజిల్లా.

## సాహిత్యోపన్యాసములు

చిలకమర్తి వారిపై వ్రాయించిన ప్రత్యేక వ్యాసాల సంపుటి. పుటలు—46 వెల - 1—00 ప్రాప్తిస్థానం— ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కళాభవనము, హైదరాబాద్—4,

## రాజకీయవీరుడు డాక్టర్ ఖాన్

రచయిత —శ్రీ బోయి భీమన్న పుటలు—120. వెల - 3 - 00 ప్రాప్తిస్థానం— సుఖేలానికేతన్ 1. సి 35,ఇర్రంమంజిల్ కాలనీ హైదరాబాద్ 34.

## స్తుతి మణి మాలికా

సంస్కృత భాష దేవనాగరిలిపి రచయిత—శ్రీ నల్లాన్ చక్రవర్తి రఘునాథాచార్యులు. పుటలు—46 వెల రూ. 1-00 దీనిలో శ్రీ శేషాద్రీశస్తుతిః (108 వృత్తాలు), శ్రీ రంగపతిస్తుతిః (30 శ్లోకాలు), దివ్యదేశాధీశస్తుతిః (43 శ్లోకాలు) ఉన్నాయి. ప్రాప్తిస్థానం—శ్రీ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు, 16-151, కరీమాబాద్ రోడ్, వరంగల్.

## మరుత్సందేశం

సంస్కృతం. 1963 నాటివరకు నవభారత విషయ వర్ణనాత్మకమైన సందేశ కావ్యం. రచయిత—శ్రీ పులికర్తి శరభాచార్యులు, పుటలు - 128. శ్లోకాలు 275: వెల - రూ. 3 - 00. ప్రాప్తిస్థానం—(1) సారథి అండ్ బ్రదర్స్, బుక్ డిపో, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్ (2) కె. వి. ఆర్ అండ్ సన్స్, గాంధీ చౌక్. తెనాలి, గుంటూరుజిల్లా.

## పైమెంతయింది?

కాలమాన చరిత్ర తెలిపే పిల్లల బొమ్మల పుస్తకం. తమిళమూలం—శ్రీ కప్పి గోపాలకృష్ణన్, తెనిగింపు—శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ. పుటలు—48 వెల—రూ. 2—00 ప్రాప్తిస్థానం—శ్రీ అద్దేపల్లి అండ్ కో, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరం.

## అడవిపూలు

ఖండకావ్య సంపుటి. రచయిత—శ్రీ శాక్యముని పుటలు—64. వెల 1-50. ప్రాప్తిస్థానం—భారత ప్రచురణలు, గిరింపేట చిత్తూరు.

## శ్రీ రామనిర్వేదము

సీతా ద్వితీయ వియోగవిధురుడైన శ్రీరాముని హృదయవేదనను విపులుగస్ఫురణకు తెచ్చే కావ్యం.

రచయిత—శ్రీ నారు నాగునార్య పుటలు — 30. వెల— 1 - 00. ప్రాప్తిస్థానం — శ్రీ నారు నాగనార్య, శ్రీ ఆత్మారామవిహారము, సి. కె. రాచపల్లి పోస్టు, వయా రైల్వే కోడూరు. రాజంపేట తాలూకా, కడపజిల్లా.

## విస్తరణ విజయుడు

సమాజవికాస పథకాల విజయం తెలిపే నాటిక. రచయిత—శ్రీ చిత్తూరి జయదేవదానం పుటలు - 20. వెల 0-50. ప్రాప్తిస్థానం — శ్రీ చిత్తూరి జయదేవదానం, ఎ. ఎల్. డబ్ల్యు, రూరల్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, ఉల్లూరు, నెల్లూరుజిల్లా

## కళాకేళి

సాహిత్య మాసపత్రిక 1968 ఏప్రిల్ సంచిక. సంపాదకుడు - శ్రీ సోమసుందర్. పుటలు—50. చందా—సంవత్సరం చందా రూ. 6—00 విడిప్రతి 0-50. ప్రాప్తిస్థానం—కళాకేళి కార్యాలయం గాంధీనగర్, కాకినాడ.

## దివ్య జీవనము

ఆధ్యాత్మిక మాసపత్రిక. 1968 ఆగస్టు సంచిక సంపాదకుడు—శ్రీ ఎన్. ఎస్. వి. రావు. పుటలు — 40. సాలు చందా రు. 4—00. విడిపత్రిక 0—50 ప్రాప్తిస్థానం సెక్రటరీ, దివ్య జీవన సంఘం, 12-10-8, సొసైటీ బిల్డింగ్స్ తణుకు, పశ్చిమ గోదావరిజిల్లా.

## నవత

ఆరవ సంచిక సంపాదకుడు—శ్రీ శ్రీ పుటలు. 48 చందా-సంవత్సరం చందా—రూ. 4 - 00. విడిసంచిక రూ. 1-00.

## సంవేదన

త్రైమాసపత్రిక. సంపాదకుడు—శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి. పుటలు 110. చందా-సాలు చందా—5—00. విడిపత్రిక రు 1-25. ప్రాప్తిస్థానం—మేనేజర్, సంవేదన, 19/78, మద్రాస్ రోడ్, కడప.

## ఆంధ్రప్రదేశ్ జీవరక్షా సంఘం

సప్తమ వార్షిక సంచిక. పుటలు—110 వెల తెలియదు. ప్రాప్తిస్థానం — ఆంధ్రప్రదేశ్ జీవరక్షా సంఘము, గుంటూరు—3.

## రంజని

హైదరాబాద్ ఎ. జి. ఆఫీసు తెలుగు సాహితీ సమితి సప్తమ వార్షిక సంచిక. పుటలు - 68. అమూల్యం. సభ్యులకు మాత్రమే ప్రాప్తిస్థానం— ఏ. జి ఆఫీసు సాహితీసమితి, ఏ. జి. ఆఫీసు, హైదరాబాద్.

## Tradition and Modernity in Telugu and Urudu literatures

ఆంగ్లం. వ్యాస సంపుటి. సంపాదకులు శ్రీయుతులు—ఎన్. కన్నయ్య, ఆలం ఖుందమిరి. పుటలు—38. వెల రు. 1 50. ప్రాప్తిస్థానం— సెక్రెటరీ, డాక్టర్ బి వి. వి. శాస్త్రి, ఇండియన్ కమిటీ ఫవర్ కల్చరల్ ఫ్రీడం, హైదరాబాద్ ఛాప్టర్, 3-4-537, నారాయణగూడ, హైదరాబాద్-27.

## శ్రీమద్ అప్పయ్య దీక్షితేంద్ర జయంతి సంచిక

దీనిలో తెలుగు, సంస్కృత, ఆంగ్ల, తమిళ వ్యాసా లున్నాయి. పుటలు—114. వెల తెలియదు. ప్రాప్తిస్థానం - జయంతి సావనీర్ కమిటీ, అడయ పాళయం, ఆరణి, నార్త్ ఆర్కాడ్ జిల్లా, తమిళనాడు

## కాకినాడ పి. ఆర్. కాలేజి మాగజైను

ఈ మాగజైన్ తాలూకు 84 వ వాల్యూం ఒకటవ సంచిక మా కార్యాలయం చేరింది. తెలుగు, ఇంగ్లీషు, హిందీ వ్యాసాలున్నాయి.

## అఖిలభారత పత్రికా సంపాదకుల మహాసభ సంచిక

పై సభ 19 వ వార్షికోత్సవ సంచిక మా కార్యాలయం చేరింది హైదరాబాద్ మహాసభ విశేషాలు, ప్రముఖుల వ్యాసాలు ఉన్నాయి.

## పునర్జన్మ విజ్ఞానము

పూర్వభాగము. రచయిత – శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి పుటలు–336 వెల–రూ. 5–00. ప్రాప్తిస్థానం–శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, పత్తిపాటి వారివీధి, కస్బా, విజయనగరము – 2.

## యుక్తులు — ఛలోక్తులు

బుజ్జాయి హాస్య చిత్రాలతోసహా. రచయిత–శ్రీ ముద్దుకృష్ణ. పుటలు–136. వెల సాదా ప్రతి రు 2–50. మేల్ప్రతి–రు 3–50. ప్రాప్తిస్థానం–విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ – 2.

## ప్రేమ పంజరం

నాటిక,రచయిత: శ్రీ సుదర్శనం పుటలు–76. వెల –1–25. ప్రాప్తిస్థానం–కళానిలయం, సత్య నారాయణపురం, గుడివాడ.

## యజ్ఞ శ్రీ వ్యాసావళి

వ్యాస సంకలనం. రచయిత – శ్రీ వెంపరాల వేంకటయజ్ఞేశ్వరశాస్త్రి. పుటలు–106 వెల – 1–50. ప్రాప్తిస్థానం — శ్రీ రామా మెడికల్ స్టోర్సు, మెయిన్‌రోడ్, ముమ్మిడివరం.

## బాపురెడ్డి గేయాలు

గేయసంపుటి. రచయిత–శ్రీ జె. బాపురెడ్డి. పుటలు–108. వెల రు. 3–00. ప్రాప్తిస్థానం–సుశీలానివేతన్, ఐ. సి. 85, ఇర్రంమంజిల్‌కాలనీ, హైదరాబాద్–34.

## భారతసాధ్వి

హుమాయూన్ ఒక సాధ్వి నిమోహించి, తర్వాత పశ్చాత్తప్తుడయిన ఇతివృత్తంగల పద్యకావ్యం. రచయిత–శ్రీ సిద్దయ్యకవి పుటలు 62. వెల 1–75 ప్రతులకు శ్రీ సిద్దయ్యకవి, సంజీవ గ్రంథమాల, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా.

## మహాభినిష్క్రమణము

కావ్యం. రచయిత–శ్రీ సిద్దయ్యకవి పుటలు–64 వెల 1–75. ప్రాప్తిస్థానం- శ్రీ సిద్దయ్య కవి, సంజీవ గ్రంథమాల, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా.

## రణవిజయం

గేయసంపుటి. రచయిత్రి–శ్రీ శీలం రాజేశం. పుటలు–24 ప్రాప్తిస్థానం–శ్రీ శీలం రాజేశం, 5–610, లష్కర్‌బజార్, హనుమకొండ, వరంగల్.

## వలపు తలపులు

గేయ సంపుటి. రచయిత–శ్రీ శీలం రాజేశం పుటలు–28. వెల—0–50 ప్రాప్తిస్థానం — శ్రీ శీలం రాజేశం, 5–610 లష్కర్‌బజార్, హనుమకొండ వరంగల్.

## పది రూపాయలనోటు

నవల, మూలం–శ్రీ కృష్ణ చందర్. అనువాదం–శ్రీ పోలు శేషగిరిరావు. పుటలు–176 వెల–సాదప్రతి–3.00 మేలు ప్రతి 4–00. ప్రాప్తిస్థానం—విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ–2.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.